

# శ్రీ కళాగౌతమి

సంపుటి 12 - సంచిక 12    మే 2022



వేదార్థచూడామణి, స్వాధ్యాయరత్న

బ్రహ్మశ్రీ గుళ్ళపల్లి సీతారామచంద్రమూర్తి ఘనపాఠీ గారు

భారతాత్మ అశోక్ సింఘాల్ వైదిక పురస్కారం



# మోడీ సఫలమయ్యాడా?

భారతదేశాన్ని మెరుగైన దేశంగా మార్చడమే నరేంద్ర మోదీ ఏకైక లక్ష్యం. భవిష్యత్తులో భారత్ ప్రపంచంలోనే అత్యంత శక్తిమంతమైన దేశంగా అవతరించి, అమెరికా, యునైటెడ్ కింగ్‌డమ్, రష్యా, జపాన్‌లను సైతం ఆశ్చర్యపరుస్తుంది.

నరేంద్ర మోదీ నిర్దిష్ట లక్ష్యం దిశగా సాగుతున్నారు. అతను ఏం చేయాలనుకుంటున్నాడో ఎవరికీ తెలియదు, అతని ఉద్దేశాలు, వ్యూహం అంచనా వేయలేము. అతను ప్రపంచంలోని అన్ని దేశాలను తన దేశంకోసం ఉపయోగించుకుంటాడు.

మొదట మోడీ పాకిస్తాన్ మరియు ఆఫ్ఘనిస్తాన్‌తో అమెరికా సంబంధాలు నాశనం చేశాడు. మొన్న వియత్నాంతో పొత్తు పెట్టుకుని, చైనా సూపర్ పవర్ కలను ఛిన్నాభిన్నం చేసి మూడు దేశాలను ఉపయోగించుకున్నాడు.

వియత్నాం, చైనాల మధ్య విదేశీ చమురు వెలికితీతపై దీర్ఘకాలంగా కొనసాగుతున్న వివాదం భారత్‌కు మేలు చేసింది. భారతదేశం మద్దతుతో, వియత్నాం చైనా యొక్క దక్షిణ సముద్రాలలో చమురు ఉత్పత్తిని ప్రారంభించింది. వియత్నాం ఇప్పుడు తన చమురు మొత్తాన్ని భారతదేశానికి సరఫరా చేస్తుంది. యునైటెడ్‌స్టేట్స్ దీనికి భిన్న మద్దతును కలిగి ఉంది.

యుద్ధానికి దిగకుండా పాకిస్థాన్‌ను పేదదేశంగా మార్చాడు. ఇరాన్ నౌకాశ్రయాన్ని తన ఆధీనంలోకి తెచ్చుకున్నాడు. ఆఫ్ఘనిస్తాన్‌తో సరిహద్దులో, పాకిస్తాన్‌ను విభజించే ప్రాంతానికి చాలా దగ్గరగా భారత సైనిక స్థావరాన్ని ఏర్పాటు చేశాడు. భారత వాణిజ్యాన్ని పెంచడానికి, ఇరాన్ (పాకిస్తాన్ వదిలి) ఆఫ్ఘనిస్తాన్‌కు ఒక మార్గాన్ని కూడా నిర్మించాడు. సెక్షన్ 370, 35 రద్దు చేయబడ్డాయి. ఏదో ఒకరోజు పాక్ ఆక్రమిత కాశ్మీర్‌ను పూర్తిగా స్వాధీనం చేసుకుంటాడు.

ఆసియాలో చైనా, అమెరికాలను ఫినిష్ చేసిన ఈవ్యక్తి సార్క్ సదస్సును రద్దుచేసి ప్రపంచానికి తన సత్తా చాటాడు. ఆసియాపై భారత్ ఔన్నత్యాన్ని నిలబెట్టుకోవడంలో మోడీ సఫలమయ్యాడు.

ఆసియాలోని రెండు ప్రధాన శక్తులైన రష్యా మరియు జపాన్‌లు చెప్పడానికి ఏమీ చేయలేదు. అతను చాలా ఖచ్చితత్వంతో తన చేతుల్లో రెండు దేశాలను పట్టుకున్నాడు. చైనా వియత్నాం ఆయిల్ ఇష్యూ విషయంలో చైనా ఆయిల్ అడుగుతుంది... ఆ తర్వాత పాక్ ఆక్రమిత కశ్మీర్‌ను అడుగుతుంది. "నేను తీసుకుంటాను.. మీ నోటిలో వెంట్రుకలు ఉన్నాయి" అని అతను అడిగేవాడు మరియు చైనా యొక్క వియత్నాం సమస్యను ఆటపట్టించాడు. చైనాచేత ఏమీ చేయలేం. ఈ వ్యక్తి భారత రాజకీయాలను పూర్తిగా భిన్నమైన స్థాయికి తీసుకెళ్తున్నాడు.

ఒక్కో దేశానికి చాలా మంది శత్రువులు ఉన్నారని చాలా దేశాలు ఆలోచిస్తున్నాయి, కానీ భారత్‌కు పాకిస్థాన్‌కు మించిన శత్రువులు లేరు. భారతదేశం ప్రపంచంలోని అన్ని దేశాలకు మిత్ర దేశంగా ఉండటం దాదాపు ఖాయమైంది. అసలు యుద్ధం కంటే ఈ వ్యక్తి పాకిస్థాన్‌కు ఎక్కువ హాని చేస్తున్నాడు. ముస్లిం దేశాలను పాకిస్థాన్‌పై ప్రయోగించడంద్వారా నరేంద్ర మోదీ ప్రపంచంలోని అత్యుత్తమ నాయకులలో ఒకరని నిరూపించుకున్నారు.

భారత్‌తో పాక్ యుద్ధానికి దిగినా ఇంత నష్టం ఉండదు. కానీ ఇప్పుడు పాకిస్థాన్‌కు అంతకంటే ఎక్కువ నష్టం వాటిల్లుతోంది. అన్ని దేశాలతో జరిగే అన్ని చర్చలలో, ఈ వ్యక్తి యొక్క నిజాయితీని పరిగణనలోకి తీసుకోవాలి. భారతదేశం యొక్క పురోగతి మిగిలిన ప్రపంచానికి కష్టం.

భారత్ ప్రస్తుత అమోఘమైన ఎదుగుదలతో ఐక్యరాజ్యసమితిలోని అన్ని దేశాలూ దాని పర్యవసానాలను అనుభవించనున్నాయి. మోదీ సాధించిన విజయాలు, ఆయన విదేశాంగ విధానం గురించి భారతదేశంలోని ఏ మీడియా కూడా ఏమి మాట్లాడదు. దానివల్ల నష్టం వాటిల్లుతోంది. మోడీ పనులు మీడియా ఎందుకు విమర్శిస్తోంది – తెలుసుకోండి.

## మన మాతృభాష

మన మాతృభాష గురించి మనలో చాలా మందికి చాలా విషయాలు తెలియవనే చెప్పాలి. నేడు మనం వాడుతున్న మాటలలో 50 శాతం ఇంగ్లీషు పదాలు, 30 శాతం సంస్కృత పదాలు, 10 శాతం ఉర్దూ, హిందీ, ఇతర పదాలు ఉన్నాయి. అంటే మనం మాట్లాడే మాటలలో 10 శాతం మాత్రమే తెలుగు పదాలు. ఈ దుస్థితి మరే భాషకు లేదనిచెప్పచ్చు.

మనం ఇప్పటికైనా కళ్ళుతెఱచి మన మాతృ భాషను, మన మాటలను మనం రక్షించుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఎందుకంటే నేడు తెలుగు వారి ఇళ్ళల్లో అంతా ఇంగ్లీషు బడి చదువులే. పిల్లలకు తెలుగు అక్షరాలు రావు. తెలుగు మాట్లాడరు, తెలుగు చదవరు. కనుక పాలకులు, ప్రజలు నడుంకట్టి మన భాషను కాపాడుకోవాలి. ఒకసారి మనం నిజ జీవి తంలో ప్రతి పొద్దు మాట్లాడే పదాలను పరిశీలించండి.

నిత్య జీవితంలో మనకు తెలియకుండానే చాపకింద నీరులా పరభాషాపదాలు ప్రవేశించి మన మాటలను బయటకు నెట్టాయి. అంటే పరభాషా పదాలు ఉపయోగించకూడదని, పరభాషను నేర్చుకో కూడదని కాదు మన వాదన. ఏదైనా పరభాషాపదం వచ్చినపుడు దానికి తగిన పదాన్ని మాతృభాషలోంచి వాడుకలోకి తేవాలి. అలాంటి ప్రయత్నం తమిళులు, కన్నడిగులు చేస్తున్నారు. కొత్తమాటలు కనిపెడుతూ వారి మాతృభాషను వారు అభివృద్ధి చేసుకుంటున్నారు.

మన తెలుగువారు మాత్రం సంస్కృత, ఆంగ్ల పదాలతో పబ్బం గడుపుకొంటున్నారు. ఈ విషయాన్ని మనందరం ఆలోచించుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది. ప్రభుత్వాలు,మేధావులు,భాషావేత్తలు,ప్రజలు స్పందించాలి. పొరుగు రాష్ట్రాలవారిని చూసైనా మన తెలుగుకు పట్టిన తెగులును వదిలించుకోవాలి. బళ్ళో తెలుగు తప్పనిసరి పాఠ్యాంశం కావాలి. ప్రతి మనిషి తన తల్లి గురించి, తల్లిభాషను గురించి గొప్పగా చెప్పుకునే రోజు రావాలి.

శ్రీకళా
# గౌతమి
తెలుగు భాషాభివృద్ధి మాసపత్రిక
వ్యవస్థాపక సంపాదకులు
డా॥ బులుసు వేంకట సత్యనారాయణ మూర్తి
facebook/kalagowtami - kalagowtami.wordpress.com
సంపుటి 12 - సంచిక 12 మే 2022



పాఠకులు చందాలు, రచనలు పంపించాల్సిన చిరునామా :
సంపాదకులు, శ్రీకళాగౌతమి,
102, మూన్ లైట్స్, జె.యన్.రోడ్, మోడల్ కోలనీ,
రాజమహేంద్రవరం-3 పిలుపు : 9866290025

410, సి బ్లాక్, గ్రీన్ హిల్స్ మెగాసిటీ,
పి.జె.ఆర్.రోడ్, చందానగర్, హైదరాబాద్-50
bulusuvsmurty@gmail.com

డిటిపి : లలిత గ్రాఫిక్స్ - 98857 00220
ముద్రణ : సుధా ఆఫ్‌సెట్ - 94403 72046

# హిందూఫోబిక్స్

8వ శతాబ్దం ప్రారంభంలో ఇస్లామిక్ దాడికి గురైన భారతదేశం 15వ శతాబ్దం చివరిలో మొగల్ పాలనతో ముగిసిపోయింది, భూమిపై పురాతన నాగరికతను కలిగియున్న ఏకైక దేశం మనది. తర్వాత, 17వ శతాబ్దం ప్రారంభంలో, బ్రిటీష్ వారు 20వ శతాబ్దం మధ్యకాలం వరకు సూర్యుడు అస్త మించని బ్రిటిష్ రాజ్యంకింద తమ వలస గుడారా లను సుగంధ ద్రవ్యాల వ్యాపారులుగా ఉపఖండంలో అడుగుపెట్టారు. భారతదేశ స్వాతంత్ర్యం కోసం హిందువుల ఉత్సాహం వేగం పుంజుకున్నప్పుడు కూడా ఉపఖండంలో విశ్వాసపాత్రుల దేశం కోసం ముసల్మాన్‌ల నినాదాలు పెరిగాయి. కాబట్టి, స్థానిక ఆజాదీ వేడిని తట్టుకోలేక, ఆంగ్లేయులు ఆ స్థలాన్ని ఖాళీ చేశారు, ఇస్లాం కోసం ప్రత్యేకంగా పాకిస్తాన్‌ను వేర్పరచడం ద్వారా భారతీయ ముసల్మాన్‌లకు ప్రత్యేక స్థలాన్ని ఇచ్చారు, అయినప్పటికీ, భారతదేశం యొక్క మత-సాంస్కృతిక విధిని హిందువులు నిర్ణయించు కునేలా చేశారు. కానీ అప్పటి హిందూ రాజకీయాలు తమ జాతీయ వాటాలో సనాతన ధర్మాన్ని, భూమి యొక్క ప్రాచీన ధర్మాన్ని పునరుత్థానం చేయాలనే కోరిక లేకుండా పోయాయి, దాని నాయకత్వానికి కూడా వెనుక దృష్టిలో కూడా దూరదృష్టి లేదు, 'ఒకసారి రెండుసార్లు కాటు వేయబడలేదు. పిరికి' కాబట్టి, మునుపెన్నడూ లేని విధంగా ఒక దేశానికి దాని తరగతులు మరియు ప్రజానీకం ద్రోహం చేయడంలో, వారు భారతదేశం యొక్క గుండెల్లో విషపూరితమైన హిందూ-ముస్లిం కిచ్డీని వండడానికి ఎంచుకున్నారు. అధ్వాన్నమైన విషయం ఏమిటంటే, కొనసాగుతున్న కథలో, ఆనాటి హిందువులు కూడా తమ భూభాగంలో ఇస్లాంవాదులు మరియు సువార్తి కులయొక్క అసహ్యకరమైన జనాభా డిజైన్లను పట్టిం చుకోవడం లేదు, అది దాని భౌగోళిక వినాశనాన్ని సూచిస్తుంది. కాబట్టి ఈ కసరత్తు భారతదేశాన్ని దాని వినాశకరమైన మార్గంలో ఉంచిన ఆత్మహత్య.

భారతీయ ముసల్మాన్‌లు హిందువులతో సహజీవనం చేయలేమని పట్టుబట్టడం పురాతన భూభాగాన్ని విభజించడానికి కారణమైనప్పటికీ మరియు అంబేద్కర్ హిందూ-ముస్లింల వలసలను ఆ స్కోర్‌పైనే విభజించినప్పటికీ, అప్పటి ఇస్లాం-అమాయక ముస్లిం-పాక్షిక గాంధీ నెహ్రూ ద్వయం నేతృత్వంలోని హిందూ నాయకత్వం భారతదేశంలో ఇస్లామిక్ ఉనికికోసం పాతుకుపోయింది. ఆ విధంగా, అతని ప్రత్యర్థి రాజు పృథ్వీరాజ్‌ను అణగదొక్కేందుకు చొరబడిన మహమ్మద్ ఘోరీతో అప్పటి జయ చంద్రుని యొక్క మోసపూరిత కుట్ర హిందూస్థాన్‌లో ఇస్లామిక్ పాలనకు పునాది వేసింది. విభజన సమయంలో హిందూ నాయకత్వం యొక్క కొరత కారణంగా ప్రధాన భూభాగం దాని ప్రాచీన హిందూ స్వభావాన్ని తిరిగి పొందకుండా నిరోధించింది. అయితే ప్రధానాంశం ఏమిటంటే, హిందూ విద్యా వంతులు కూడా ఒక చేత్తో పాకిస్తాన్‌లో తమ ఇస్లామిక్ స్థలాన్ని ఇస్లామిక్ ప్రదేశాన్ని భారతదేశంలోని హిందూ ధర్మాన్ని నిర్బంధించగలిగేలా చేయడంలోని అహేతు కతను చూడటంలో ఎలా విఫలమయ్యారనేది! వారి ఇస్లామిక్ స్వభావానికి అనుగుణంగా, భారతీయ ముసల్మాన్లు దానిలో ఉన్నారు, కాబట్టి పదం నుండి చెప్పాలంటే, వందేమాతరాన్ని జాతీయ గీతంగా వీటో చేయడం, మాతృభూమిని కీర్తించడానికి నిరాకరిం చడం, సూర్య భగవానుడికి నమస్కారాన్ని వ్యతిరేకిం చడం, సరస్వతీ దేవత ప్రార్థనలను అడ్డుకోవడం. భారతదేశంలోని ఇస్లామిక్ క్రెడోలను ఉదహరిస్తూ (!) దాని లౌకిక రాజ్యం తన హిందూ సబ్జెక్టులను నిస్సహాయంగా ఉండేలా షరతు విధించింది. మానవ చరిత్ర యొక్క చరిత్రలో ఇంత సమాంతరం ఉందా అని ఆశ్చర్యపోతారు, ప్రపంచంలోని హిందూఫోబిక్స్ చెప్పాలి.

# చట్టబద్ధత

భారతదేశం ప్రపంచంలోనే అతిపెద్ద ప్రజాస్వామ్యం. బ్రిటిష్ పాలన నుండి స్వాతంత్ర్యం పొందింది. ప్రజాస్వామ్య ప్రక్రియ నిలిచిపోయిన 1975-77లో ఎమర్జెన్సీ క్లుప్త కాలం మాత్రమే దీనికి మినహాయింపు. భారతదేశంలో ప్రజాస్వామ్యం విజయవంతమైందని ప్రపంచంలోని చాలా మంది భయపడ్డారు. పాకిస్తాన్‌తో సహా ఈ ప్రాంతంలోని అనేక దేశాలు ప్రజాస్వామ్యంగా విఫలమైనప్పుడు మరియు దాని స్థానంలో అధికార మరియు సైనిక మార్గాన్ని ఎంచుకున్నప్పుడు వారి నమ్మకం మరింత బలపడింది. కానీ భారతదేశంలో ఇది జరగలేదు మరియు మనం ప్రజాస్వామ్యంగా ఏడు పదులు పైగా దాటాము. భారతదేశం వినాశన ప్రవచనా లన్నింటినీ తారుమారు చేసింది. భారతదేశంలో రాజ్యమేలుతున్నది బ్యాలెట్, బుల్లెట్ కాదు.

భారత రాజకీయాల్లో 1947 నుంచి 1984 మధ్య చాలా ముఖ్యమైన సంఘటనలు జరిగాయి. భారతదేశ విభజన, కాశ్మీర్ సమస్య, ఈశాన్య తిరుగు బాటు, భారతదేశ ఏకీకరణ, హిందూ వివాహ చట్టంపై వివాదం, మతపరమైన అల్లర్లు, భాషా ప్రాతిపదికన రాష్ట్రాల ఏర్పాటు డిమాండ్, కేరళలో రాష్ట్రపతి పాలన, 1962 ఇండో-చైనా యుద్ధం, ఇండో-పాక్ 1965-1971 యుద్ధం, హరిత విప్లవం, కాంగ్రెస్ చీలిక, రాజకీయాలను ఒక పార్టీ ఆధిపత్యం నుండి ప్రాంతీయ పార్టీల వృద్ధికి మార్చడం, ఎమర్జెన్సీ, జనతా పార్టీ ప్రభుత్వం, ఇందిరా గాంధీ హత్య, సిక్కు అల్లర్లు, వివిధ రాజకీయ పార్టీల ఏర్పాటు మరియు సిద్ధాంతాలు మొదలైనవి.

**అధ్యయనం యొక్క హేతుబద్ధత**

భారతదేశం ప్రజాస్వామ్య దేశం మరియు భారతదేశంలో రాజకీయ పార్టీలు ముఖ్యమైన పాత్ర పోషిస్తాయి. నేను ఈ అంశాన్ని ఎంచుకున్నాను ఎందుకంటే భారతదేశంలో ప్రజాస్వామ్య రాజకీ యాల పునాది ఈ కాలంలోనే స్థాపించబడింది. ఈశాన్య తిరుగుబాటు, కాశ్మీర్ సమస్య, మతతత్వం, మత రాజకీయాలు, పాకిస్తాన్ మరియు చైనాలతో సరిహద్దు సమస్య మొదలైన ప్రధాన సవాళ్లు ఈ కాలంలోనే భారత్ ఎదుర్కొంటున్నాయి. ఈ కాలంలో అనేక ప్రధాన సంఘటనలు జరిగాయి, ఇది ప్రజా స్వామ్యాన్ని బలోపేతం చేసింది మరియు ఈ దేశ అభివృద్ధికి బలమైన పునాదిని కూడా వేసింది. ఈ దశ అధ్యయనం చేయడానికి కూడా ఆసక్తికరంగా ఉంటుంది, ఎందుకంటే ప్రాంతీయ పార్టీల పెరుగుదల వంటి కొన్ని ప్రధాన సంఘటనలు తమ ప్రాంతంలో కాంగ్రెస్ ఆధిపత్యాన్ని సవాలు చేయడం మరియు కాంగ్రెస్ పతనంతో జనతా పార్టీ పుంజు కోవడం, కాంగ్రెస్ తిరిగి అధికారాన్ని పొందడం మరియు కేంద్రంలో ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడం, దేశంలో జాతీయ అత్యవసర పరిస్థితిని విధించడం మొదలైనవి.

1947లో J&K రాచరిక రాష్ట్రం భారత దేశంలోకి ప్రవేశించినప్పటి నుండి కథలను ట్రేస్ చేస్తుంది. భారత్‌తో చేరిక లాంఛనప్రాయమైన తర్వాత, దానిని ప్రజాభిప్రాయ సేకరణ ద్వారా ఆమోదించాలని GOI కోరింది. ఈసమయంలో కాంగ్రెస్ ప్రజాభిప్రాయానికి కట్టుబడి గెలుస్తామన్న నమ్మకంతో ఉంది. 1953 నాటికి ఈ విశ్వాసం ఆవిరైపోయింది. షేక్ అబ్దుల్లాను నిరవధిక నిర్బంధం లో ఉంచారు మరియు ప్రజాభిప్రాయ సేకరణ ప్రశ్న సుదీర్ఘ చర్చనీయాంశంగా మారింది. కాశ్మీర్ మరియు మిగిలిన భారతదేశం మధ్య భావోద్వేగ సంబంధాలు తరువాత చీలిపోయి, లౌకిక మరియు ప్రజాస్వామ్య కాశ్మీర్‌యొక్క ప్రాతిపదిక బలహీనపడింది, భారత రాజ్యానికి చట్టబద్ధత ధ్వంసం చేయబడింది

# రామ రాజ్యం మళ్లీ మొదలైంది

– సుల్తాని అంజిరెడ్డి

మనకే తెలియని చరిత్ర అందామా... మనకు తెలియకుండా ఉంచిన చరిత్ర అందామా... మనకు తెలుసుకునే ఓపిక లేని చరిత్ర అందామా... సాగునీటి ప్రాజెక్టులు అంటే ఏంటో ప్రపంచానికి తెలియని కాలంలో... అంటే దాదాపు 2000 సంవత్సరాలక్రితమే... చోళ రాజు కరికాలుడు తమిళనాట తిరుచునాపల్లి జిల్లాలో కావేరి నది మీద నిర్మించిన ఈ ప్రాజెక్టు "Kallanai ( The Grand Anicut ) dam" ఈ రోజుకి కూడా తన సేవలు అందిస్తూ నేటి సోకాల్డ్... ఆధునిక ఇంజనీర్లకు సవాలు విసురుతూనే ఉంది.... సాగునీటి (వ్యవసాయం) కోసం 2వ శతాబ్దం లోనే dam లు నిర్మించిన Early చోళ king కారికలన్ గురించి ఎక్కడ స్కూల్ పుస్తకంలలో చెప్పలేదు.. ఎందుకు?..

---

# ఊరగాయ ముక్క

– Mohan Sambanna Malekar

గురుకుల్ ఘోరండాకు చెందిన ఆచార్య ఒక్కరు జనసంఘ (పూర్వ బిజెపి) టికెట్‌పై ఎంపీ అయ్యాడు, అతను ప్రభుత్వ వసతి తీసుకో లేదు. ఢిల్లీ మార్కెట్‌లోని ఢీల్లీ –6 లోని సీతారామ్‌కు చెందిన ఆర్య సమాజ్ మందిరంలో నివసించారు. అక్కడ నుండి పార్లమెంటుకు నడచి వెళ్ళేవారు. తన జీతం మొత్తాన్ని రక్షణ శాఖకు విరాళంగా ఇచ్చారు.

ప్రతి ప్రశ్న జవాబు చెప్పడానికి ముందు పార్లమెంటులో వేదమంత్రాన్ని పఠించే మొదటి ఎంపీ ఆయనే మాత్రమే. ఆ వేదమంత్రాలన్నీ పార్లమెంటు కార్యకలాపాల రికార్డులో చూడవచ్చు. గోవు వధను ఆపాలని ఆయన ఒకసారి పార్లమెంటుకు ఘెరావ్ చేశారు.

ఒకసారి ఇందిరాజి ఆ స్వామిజిని ఒక ఫైవ్ స్టార్ హెూటల్‌కు ఒక సమావేశంలో పిలిచారు. అక్కడ భోజనం ప్రారంభించినప్పుడు, అందరూ బఫే కౌంటర్ వైపు నడవడం ప్రారంభించారు. స్వామి అక్కడికి వెళ్ళలేదు. అతను తన జేబులో నుండి రెండు ఎండు రోటీలను తీసి బఫే కౌంటర్ నుండి నేలమీద కూర్చోవడం ప్రారంభించాడు.

ఇందిరా జి – "మీరు ఏమి చేస్తున్నారు మీకు ఇక్కడ ఆహారం రాలేదా? ఈ ఫైవ్ స్టార్ ఏర్పాట్లన్నీ ఎంపీలకోసం మాత్రమే చేయబడ్డాయి. మీరు ఇవి సేవించ కుండా ఇలాంటి ఆహారం తీసుకుంటున్నారు దానికి అతను ఇలా అన్నాడు – "నేను సన్యాసిని ఎవరో ఈ రోటీలను ఉదయం భిక్షలో ఇచ్చారు. ప్రభుత్వ డబ్బుతో రొట్టె ఎలా తినగలను."

ఇందిరాకు కృతజ్ఞతలు తెలుపుతూ, హెూటల్ లోనుండి ఒక గ్లాసు నీరు మరియు మామిడి ఊర గాయ ముక్కను తీసుకున్నాడు. ఇందిరాజి నిరాకరించి నప్పటికీ తాను తీసుకున్న వాటికి కూడా డబ్బు చెల్లించాడు! ఈ గొప్ప పార్లమెంటు సభ్యుడు మరియు సన్యాసిని ఎవరో మీకు తెలుసా?

ఇది సన్యాసి స్వామి రామేశ్వరానంద్ జీ. హార్ద్వార్ ఆర్య సమాజ్. గోవు అంటే ప్రాణం గొప్ప గోమాత భక్తుడు. ప్రత్యేక వ్యక్తిత్వానికి కలవాడు .. స్వామీజీ హర్యానాలోని కర్నాల్ నుండి ఎంపి గా ఎన్నికయ్యారు..

---

**తెలుగు భాషాభివృద్ధికి కలిసి పనిచేద్దాం, తెలుగు వాణిని దశదిశలా పంచడానికి కృషిచేద్దాం.**

# కవిత రాసేయాలి

ఎలా ఆరంభించాలో
ఎలా ముగించాలో తెలియదు
ఒక కవిత రాసి పడేయాలి !
బుర్రలో ఒకటే ఆలోచన
కుమ్మరిపుర్గై తిరుగుతూ
మనసుని తొలిచేస్తుంది !
ఏభై రెండు అక్షరాలతో
వేనవేలు పదాలు ఉద్భవించినపుడు
అర్థశత భావాలతో
లోకాన్నేలే కవి కాలేమా ?
సూక్ష్మవిత్తు నుండి
శాఖోపశాఖలుగా
వటవృక్షం పుట్టినపుడు
అల్పభావవీచిక నుండి
అనల్ప కవితావృక్షం సృష్టించలేమా?
పరమాణువు విస్ఫోటిస్తే
భూమండలం బద్దలైనప్పుడు
పదాలు పేల్చేస్తే
కవితాభాండాగారం తెరుచుకోదా ?
ఏక కణజీవి పరిణామం చెంది
అనేక జీవరాశులుగా ఏర్పడినపుడు
ఏకైక కవి విశ్వరూపం దాల్చి
అసంఖ్యాక సాహిత్యరాశులుగా
విస్తరించలేడా ?
రాయాలనే తపన రగులుతుంటే
మెదడు సాలెగూడులో
చిక్కుకున్న భావాలు
వాటంతటవే పగులుతాయి !
రాయాలనే తపన రగులుతుంటే
నాలుక మెలికలో
బందీ అయిన అక్షరాలు
తమంతట తామే విడుదలౌతాయి !
ఎలా ప్రారంభించాలో
ఎలా ముగించాలో
పదాలే నిర్ణయిస్తాయి
కవిత పూర్తయిపోతుంది
ఇలాగే .... !

పి. లక్ష్మణ్ రావ్
విజయనగరం 9441215989

సందేహం- **"ఋణానుబంధ రూపేణ పశుపత్ని సుతాలయాః"** ఈ సూక్తి ఏ సందర్భములోనిది?
సమాధానం- ఈ ప్రసిద్ధ సూక్తి శ్రీ భాగవత పురాణంలోని చిత్రకేతు ఉపాఖ్యానంలోనిది.

శూరసేన దేశానికి రాజైన చిత్రకేతుడికి ఎన్ని వివాహాలు చేసుకున్నా సంతానం కలగలేదు. అంగీరస మహాముని రాజు చేత పుత్రకామేష్టి యాగం చేయించి యజ్ఞ ప్రసాదం పట్టపురాణికి ఇచ్చాడు. ఆమెకు కడుపుపండి పుత్రుడు కలిగాడు. చిత్రకేతుడు ఆ పుత్రుడి మోహంలోపడి, సర్వం మరిచాడు. అయితే తల్లి అయిన పట్టపురాణిని మాత్రం మిక్కిలి ఆదరంతో చూచేవాడు. ఇతర రాణులకు ఇది నచ్చక, వారు బాలునికి విషం పెట్టి చంపేశారు.

మరణించిన బాలుడి కోసం రాజు, రాణి విలపిస్తూండగా అంగీరసుడు నారదునితో వచ్చి రాజును ఓదారుస్తూ ఇట్లా అన్నాడు. "రాజా! ఋణానుబంధరూపేణా పశు,పత్ని,సుతాలయాః! పశువులు,పత్నులు,కుమారులు,గృహాలు మొదలైనవి మానవులు చేసుకున్న ఋణాలనుబట్టి వస్తూ,పోతూ ఉంటాయికదా! ఈ ప్రపంచం స్వప్నం లాంటిది. కల నిజమవుతుందా? కర్మవశాన జీవులు పుడుతూ, గిడుతూ ఉంటారు. ఎవరికి ఎవరు ఏమవుతారు? ఈ మోహ వికారాన్ని వదిలి, శ్రీహరిని ధ్యానించు" అని చెప్పాడు. అపుడు నారదుడు "ఓ రాజా! నీకూ వీనికి బంధుత్వం ఏమిటో చూడు" అని బాలుడి దేహాన్ని జూచి "ఓ జీవా! నీ తల్లిదండ్రులు నీకై దుఃఖిస్తున్నారు. నీవు తిరిగి ఈ దేహంలో ప్రవేశించి, వీరికి సంతోషం కలిగించు" అన్నాడు. ఆ బాలుడు ఇలా అన్నాడు "కర్మ బద్ధుడినై అనేక జన్మలెత్తుతున్న నాకు వీరు ఏ జన్మలో తల్లిదండ్రులు? ఒక్కొక్క జన్మలో వేరు వేరు తల్లిదండ్రులు, బంధువులు నాకు ఏర్పడుతున్నారు. మరో జన్మ, మరో తల్లి, తండ్రి నా కోసం ఎదురు చూస్తున్నారు, వస్తా" అనుకుంటూ వెళ్ళిపోయాడు. అపుడు చిత్రకేతుడు మోహం విడిచి బాలుని దేహానికి యమునా నదిలో ఉత్తర క్రియలు చేసి, నారదునిచే నారాయణ మంత్రం ఉపదేశం పొంది కృతకృత్యుడయ్యాడు.

ముంబై హైకోర్టు సీనియర్ న్యాయవాది డికె శ్రీవాస్తవ రాసిన ఈ పోస్ట్‌తో మన జ్ఞానం పెరుగుతుంది.

**ఇదీ భారతదేశ వ్యవస్థ!! మీరే చూడండి ....**- పాలక పురుషోత్తం.

1- ఒక వ్యక్తి రాజకీయ నాయకుడు కావాలను కుంటే, అతను ఒకేసారి రెండు స్థానాలనుండి ఎన్నికల్లో పోటీ చేయవచ్చు. కానీ అదే వ్యక్తి మాత్రం రెండు చోట్ల ఓటు వేయలేరు.

2- ఒక వ్యక్తి జైలులో ఉంటే ఓటు వేయలేరు. కానీ అదే వ్యక్తి రాజకీయనాయకుడు కావాలనుకుంటే మాత్రం జైలులో ఉన్నప్పుడు కూడా ఎన్నికల్లో పోటీ చేయవచ్చు.

3-ఒక వ్యక్తి ఎప్పుడైనా జైలుకు వెళ్లినట్లయితే జీవిత కాలం ప్రభుత్వ ఉద్యోగం రాదు, కానీ అదే వ్యక్తి హత్య లేదా అత్యాచారానికి పాల్పడినా, ఎన్నిసార్లు జైలుశిక్ష అనుభవించినా, ప్రధాని లేదా రాష్ట్రపతి కూడా కావచ్చు

4- ఒక వ్యక్తి నిరాడంబరమైన ఉద్యోగం పొందడానికి గ్రాడ్యుయేట్ అయి ఉండాలి. కానీ అదే వ్యక్తి చదువు లేనప్పటికీ భారతదేశ ఆర్థిక లేదా విద్యా మంత్రి కావచ్చు.

5-ఒకవ్యక్తి సైన్యంలో చేరటానికి మైనర్ అయి ఉండాలి, 10 కిలోమీటర్లు పరిగెత్తి డిగ్రీ చూపించాలి. కానీ అదే వ్యక్తి నిరక్షరాస్యుడు, పిరికివాడు, కుంటి వాడు అవుతూ కూడా డిఫెన్స్ మినిస్టర్ కూడా కావచ్చు.

6-ఒక వ్యక్తి వేలాది కేసులలో నిందితుడైనప్పటికీ న్యాయ లేదా హోం మంత్రి కూడా కావచ్చు. ఈ వ్యవస్థను మార్చాలని మీరు అనుకోవట్లేదా?

నాయకులు మరియు ప్రజలు ఇద్దరికీ ఒకే చట్టం ఉండవద్దా?

కాబట్టి దయచేసి ఈ సందేశాన్ని ఫార్వార్డ్ చేయడం ద్వారా దేశంలో అవగాహన తీసుకురావడానికి మీమద్దతు ఇవ్వండి.

మీరు ఫార్వార్డ్ చేయకపోతే ఏ నాయకుడిని నిందించవద్దు .... కాకపోతే, మీరు నష్టానికి బాధ్యత వహిస్తారు.

30 నుండి 35 సంవత్సరాల వరకు సంతృప్తికరమైన సేవను అందించిన తర్వాత కూడా ప్రభుత్వ ఉద్యోగికి పెన్షన్ అర్హత లేదా?

కేవలం 5 సంవత్సరాలు కూడా రాజకీయ పదవిలో లేకుండా పెన్షనా?

ఎన్ని రాజకీయ పదవులు పోషిస్తే అన్ని పెన్షన్లా? న్యాయం ఎక్కడ ఉంది ...?

శ్రీ డి. కె. శ్రీవాస్తవ
చీఫ్ పబ్లిక్ ప్రాసిక్యూటర్
బొంబాయి హైకోర్టు. ముంబై .....

ఈ ప్రచారాన్ని ముందుకు తీసుకెళ్లండి తొలగించ వద్దు. ఈ వ్యవస్థను మార్చటం నిజంగా అవసరం కాదా! దయచేసి ఆలోచించండి - ఈ దేశం మనది మనందరిది - దీని బాగుపైనే మన జీవితాల బాగు.

---

Mohan Sambanna Malekar

జవహర్‌లాల్ నెహ్రూను కలవడానికి ఒక మహిళ వచ్చి అతనికి నోట్‌బుక్, పర్సు ఇచ్చింది. నెహ్రూ ఆ బ్యాగ్ తెరిచినప్పుడు, అందులో 35 లక్షల రూపాయలు ఉన్నాయి మరియు ఆ నోట్బుక్లో డబ్బు యొక్క పూర్తి ఖాతా ఉంది. ఆ డబ్బు కాంగ్రెస్ సంస్థకు మూలధనం. దీనిని ఆ మహిళ తండ్రి లెక్కించారు. తన తండ్రి మరణం తరువాత, ఒక రూపాయి కూడా తన వద్ద ఉంచుకోకుండా, ఆ మహిళ నెహ్రూకు ఆ మొత్తాన్ని ఇచ్చి, ఆమె తన ఇంటికి వెళ్ళింది. జీవితకాల సమర్పణ భావం, దేశభక్తి కలిగిన ఎల్లప్పుడూ రైల్వే జనరల్ క్లాస్ కోచ్లలో ప్రయాణించడం మరియు తన చేతులతో తయారు చేసిన దుస్తులను ధరించే మహిళ, స్వాతంత్ర్యం తరువాత కాలం మరచిపోయింది - ఇంత గొప్ప వ్యక్తిత్వం గల ఈమె దేశ సమర్ధ నాయకుడు ప్ర ప్రధాని కాలసిన సర్దార్ వల్లభాయ్ పటేల్ కుమార్తె "మణిబేహన్". స్వాతంత్ర్యం యొక్క అమర చిహ్నం అయిన ఆమె దేశానికి నిస్వార్థ సేవ చేశారు. ఇది మన దేశానికి అమూల్యమైన ఆభరణం

# తప్పక తెలుసుకోవాలి

దిక్కులు : (1) తూర్పు, (2) దక్షిణం, (3) పడమర, (4) ఉత్తరం
మూలలు :(1) ఆగ్నేయం, (2) నైరుతి, (3) వాయువ్యం, (4) ఈశాన్యం
వేదాలు :(1) ఋగ్వేదం, (2) యజుర్వేదం, (3) సామవేదం, (4) అదర్వణ వేదం
పురుషార్థాలు : (1) ధర్మ, (2) అర్థ, (3) కామ, (4) మోక్షాలు
పంచభూతాలు :(1) గాలి, (2) నీరు,(3) భూమి, (4) ఆకాశం, (5) అగ్ని.
పంచేంద్రియాలు : (1) కన్ను, (2) ముక్కు, (3) చెవి, (4) నాలుక, (5) చర్మం.
లలిత కళలు : (1) కవిత్వం, (2) చిత్రలేఖనం, (3) నాట్యం, (4) సంగీతం, (5) శిల్పం.
పంచగంగలు : (1) గంగ, (2) కృష్ణ, (3) గోదావరి, (4) కావేరి, (5) తుంగభద్ర.
దేవతావృక్షాలు : (1) మందారం, (2) పారిజాతం, (3) కల్పవృక్షం, (4) సంతానం, (5) హరిచందనం.
పంచోపచారాలు : (1) స్నానం, (2) పూజ, (3) నైవేద్యం, (4) ప్రదక్షిణం, (5) నమస్కారం.
పంచామృతాలు : (1) ఆవుపాలు,(2) పెరుగు, (3) నెయ్యి, (4) చక్కెర, (5) తేనె.
పంచలోహాలు : (1) బంగారం, (2) వెండి, (3) రాగి, (4) సీసం, (5) తగరం.
పంచారామాలు : (1) అమరావతి, (2) భీమవరం, (3) పాలకొల్లు, (4) సామర్లకోట, (5) ద్రాక్షారామం
షడ్రుచులు : (1) తీపి, (2) పులుపు, (3) చేదు, (4) వగరు, (5) కారం, (6) ఉప్పు.
అరిషడ్వర్గాలు, షడ్గుణాలు:(1) కామం, (2) క్రోధం, (3) లోభం, (4) మోహం, (5) మదం, (6) మత్సరం.
ఋతువులు : (1) వసంత,(2) గ్రీష్మ, (3) వర్ష, (4) శరద్‌ఋతువు, (5) హేమంత, (6) శిశిర
సప్త ఋషులు : (1) కాశ్యపుడు,(2) గౌతముడు, (3) అత్రి, (4) విశ్వామిత్రుడు, (5) భరద్వాజ, (6) జమదగ్ని, (7) వశిష్ఠుడు.
తిరుపతి సప్తగిరులు : (1) శేషాద్రి,(2) నీలాద్రి, (3) గరుడాద్రి, (4) అంజనాద్రి, (5) వృషభాద్రి, (6) నారాయణాద్రి, (7) వేంకటాద్రి.
సప్త వ్యసనాలు : (1) జూదం,(2) మద్యం, (3) దొంగతనం, (4) వేట, (5) వ్యభిచారం, (6) దుబారఖర్చు,(7) కఠినంగా మాట్లాడటం.
సప్త నదులు : (1) గంగ, (2) యమున, (3) సరస్వతి, (4) గోదావరి, (5) సింధు, (6) నర్మద, (7) కావేరి.
నవధాన్యాలు : (1) గోధుమ, (2) వడ్లు, (3) పెసలు, (4) శనగలు, (5) కందులు, (6) నువ్వులు, (7) మినుములు, (8) ఉలవలు, (9) అలసందలు.
నవరత్నాలు : (1) ముత్యం, (2) పగడం,(3) వజ్రం, (4) గోమేధికం,(5) కెంపు,(6) కనకపుష్యరాగం, (7)నీలం, (8)పచ్చ(మరకతం),(9)ఎరుపు (వైడూర్యం).
నవధాతువులు : (1) బంగారం, (2) వెండి, (3) ఇత్తడి, (4) రాగి, (5) ఇనుము, (6) కంచు, (7) సీసం, (8) తగరం, (9) కాంతలోహం.
నవరసాలు : (1) హాస్యం,(2) శృంగార, (3) కరుణ, (4) శాంత, (5) రౌద్ర, (6) భయానక, (7) బీభత్స, (8) అద్భుత, (9) వీర
నవదుర్గలు : (1) శైలపుత్రి, (2) బ్రహ్మ చారిణి, (3) చంద్రఘంట, (4) కూష్మాండ, (5) స్కందమాత, (6) కాత్యాయని, (7) కాళరాత్రి, (8) మహాగౌరి,

(9) సిద్ధిధాత్రి.

దశ సంస్కారాలు : (1) వివాహం, (2) గర్భాదానం, (3) పుంసవనం, (4) సీమంతం, (5) జాతకకర్మ, (6) నామకరణం, (7) అన్నప్రాశనం, (8) చూడకర్మ, (9) ఉపనయనం, (10) సమవర్తనం

దశావతారాలు : (1) మత్స్య,(2) కూర్మ, (3 ) వరాహ, (4) నరసింహ, (5) వామన, (6) పరశురామ, (7) శ్రీరామ, (8) శ్రీకృష్ణ, (9) బుద్ధ, (10) కల్కి.

జ్యోతిర్లింగాలు : (1)హిమలయపర్వతం కేదారేశ్వర లింగం. (2)కాశీ విశ్వేశ్వరుడు. (3) మధ్యప్రదేశ్ మహాకాలేశ్వరలింగం, (4) ఓంకారేశ్వరలింగం. (5) గుజరాత్ సోమనాధలింగం,(6) నాగేశ్వరలింగం. (7)మహారాష్ట్ర భీమశంకరం,(8) త్ర్యంబకేశ్వరం, (9) ఘృష్ణేశ్వరం, (10) వైద్యనాదేశ్వరం. (11) ఆంధ్రప్రదేశ్ మల్లిఖార్జునలింగం (శ్రీశైలం) (12) తమిళనాడు రామలింగేశ్వరం

తెలుగు వారాలు : (1) ఆది, (2) సోమ, (3) మంగళ, (4) బుధ, (5) గురు, (6) శుక్ర, (7) శని.

తెలుగు నెలలు : (1) చైత్రం,(2) వైశాఖం,(3) జ్యేష్ఠం, (4) ఆషాఢం, (5) శ్రావణం, (6) భాద్రపదం, (7) ఆశ్వీయుజం, (8) కార్తీకం, (9) మార్గశిరం, (10) పుష్యం, (11) మాఘం, (12) ఫాల్గుణం.

రాశులు : (1) మేషం,(2) వృషభం, (3) మిథునం, (4) కర్కాటకం,(5) సింహం, (6) కన్య, (7) తుల, (8) వృశ్చికం, (9) ధనస్సు, (10) మకరం, (11) కుంభం, (12) మీనం.

తిథులు : (1) పాఢ్యమి, (2) విధియ, (3) తదియ, (4) చవితి,(5) పంచమి, (6) షష్ఠి, (7) సప్తమి, (8) అష్టమి, (9) నవమి, (10) దశమి,(11) ఏకాదశి, (12) ద్వాదశి, (13) త్రయోదశి, (14) చతుర్దశి, (15) అమావాస్య /పౌర్ణమి.

నక్షత్రాలు : (1) అశ్విని, (2) భరణి, (3) కృత్తిక, (4) రోహిణి, (5) మృగశిర, (6) ఆరుద్ర, (7) పునర్వసు, (8) పుష్యమి, (9) ఆశ్లేష, (10) మఖ, (11) పుబ్బ, (12) ఉత్తర, (13) హస్త, (14) చిత్త, (15) స్వాతి, (16) విశాఖ, (17) అనురాధ, (18) జ్యేష్ఠ, (19) మూల, (20) పూర్వాషాఢ, (21)ఉత్తరాషాఢ, (22) శ్రావణం, (23) ధనిష్ఠ, (24) శతభిషం, (25) పూర్వాబాద్ర, (26) ఉత్తరాబాద్ర, (27) రేవతి.

16.చిత్రభాను. - 1942, 2002, 2062, 2122
17.స్వభాను. - 1943, 2003, 2063, 2123
18.తారణ. - 1944, 2004, 2064, 2124
19.పార్థివ. - 1945, 2005, 2065, 2125
20.వ్యయ.-1946, 2006, 2066, 2126

## భారతదేశంలో తెలుగువారెందరున్నారు?

దక్షిణ భారతదేశంలో ఈనాటికీ ఎక్కువ మంది మాట్లాడే భాష తెలుగు. మిగిలిన అన్ని భాషల వారూ కలిసినా కూడా తెలుగువా రొక్కరే పెద్ద సంఖ్యలో ఉన్నారు. దక్షిణాదిన నేటికీ 50 శాతం పైగా తెలుగు వారున్నారు.

తెలుగువారి సంఖ్యను వివరంగా చూద్దాం -

రెండు తెలుగు రాష్ట్రాలు 90% సుమారు 7 కోట్లు
తమిళనాడు 42% సుమారు 2 కోట్ల 80 లక్షలు
కర్ణాటక 33% సుమారు 1 కోటి 70 లక్షలు
మహారాష్ట్ర 26% సుమారు 1 కోటి 50 లక్షలు
ఒరిస్సా 22% సుమారు 80 లక్షలు
ఛత్తీస్‌ఘడ్ 22% సుమారు 80 లక్షలు
కేరళ 12% సుమారు 40 లక్షలు

అంటే దక్షిణ భారతదేశంలో పద్నాలుగున్నర కోట్లకు పైగా తెలుగువారున్నారు. ఉత్తర భారతం, ఇతర దేశాలలోని తెలుగువారిని కలుపుకుంటే తెలుగువారు 16 కోట్లకు పైనే. అంటే భారతదేశంలో ఎక్కువ మందికి తల్లిపలుకు తెలుగే. ఆంధ్రప్రదేశ్‌కు బయట దక్షిణాదిన 8 కోట్లమంది తెలుగువారున్నారు. ఈ సంఖ్య రెండు తెలుగు రాష్ట్రాలలోని తెలుగువారికంటే ఎక్కువ.

## చిత్తూరు మాండలికం

– కొలకలూరి శ్రీధర్ – హైదరాబాదు

ఏంబా మలైకు పోయినావా?... చెప్పండి! చిత్తూరు సోదరులు అడుగుతున్నారు 'మీరు తిరుమలకు వెళ్లారా? లేదా?' అని! ఆయన ఇప్పుడదా పూడ్సినాడు... ఇదీ ఆ జిల్లా మాటే. అర్థం... 'ఆయన ఇప్పుడే వెళ్లాడు'! 'గోల గోవిందరాజులుది ముడు పులు వెంకటేశు లువి'... ఈ సామెత వెనక కథ కూడా ఆ జిల్లాకే సొంతం. చిత్తూరుకు పోతే ఇలాంటి భాషా చమక్కులు చాలా వినపడతాయి. తమిళ, కన్నడ ప్రాంతాలతో సరిహద్దును పంచుకుంటూనే తెలుగు వాడుకలో తనదైన ప్రత్యేకతను నిలుపుకుంటున్న ఆ జిల్లా మాటల ముచ్చట్లు మీకోసం...

కలియుగ దైవంగా భాసిల్లుతున్న కొండల రాయుడు కొలువైన వెంకటాద్రి... మూగప్రాణుల అజరామర భక్తికి నిదర్శనమైన శ్రీకాళహస్తి... ప్రమాణాల వినాయకుని కాణిపాకం... శౌర్యానికి గిరి గీసిన చంద్రగిరి... బోయకొండ గంగమ్మ... వేల సంవత్సరాల కిందటే రాళ్లకాలువలో ఆదిమ మానవుడు తిరిగిన జాడలు... చెన్నపట్నం చేరుకునే నావికులకు దిక్సూచిగా నిలిచిన నగరి ముక్కు కొండలు... చెప్పుకుంటే పోతే చిత్తూరు జిల్లా ప్రాశస్త్యం అంతా ఇంతా కాదు.

కడప జిల్లా, ఆర్కాట్ సంస్థానాల్లోని కొన్ని ప్రాంతాలగు పుంగనూరు, కంగుంది, శ్రీకాళహస్తి సంస్థానాలకు సంబంధించిన ప్రాంతాలను కలిపి 1911లో ఈ జిల్లాను ఏర్పాటు చేశారు. ఇక్కడి భాష మీద సరిహద్దు రాష్ట్రాలైన తమిళనాడు, కర్ణాటకలతో పాటు పొరుగు జిల్లాలు నెల్లూరు, అనంతపురం, కడపల ప్రభావమూ ఎక్కువే. అయితే పల్లెపట్టులతో పాటు కొన్ని పట్టణ ప్రాంతాల్లో చిత్తూరు జిల్లాకే సొంతమైన యాస వినపడుతుంది.

జిల్లాలో తూర్పుప్రాంతంలో యాస ఒకరకంగా పడమర ప్రాంతాల్లో మరోలా ఉంటుంది. 'ఆయన ఇప్పుడదా పూడ్సినాడు" అంటూంటారు. 'వెళ్లినాడు' అనే దానికి ప్రత్యామ్నాయంగా 'పూడ్సినాడు' అని అంటారు. పురోహితులతో పాటు ఉపాధ్యాయులనూ అయ్యోరు, ఉపాధ్యాయినులను అమ్మోరు అనడం విశేషం. ఎక్కువగా ఏకవచన ప్రయోగమే ఉంటుంది. తండ్రి అన్నను పెదనాయనగా, తమ్ముణ్ని చిన్నాయ నగా పిలుస్తారు.

తమిళ ప్రాబల్యమున్న ప్రాంతాల్లో బావ మరిదిని మచ్చీ, మచ్చాగా వ్యవహరిస్తారు. ఏ వ్యాపారం చేసేవారిని ఆయా పేర్లతో పిలవడం ఇక్కడి ప్రత్యేకత. మస్తాన్ అనే వ్యక్తి ట్యాక్సీలు నడిపితే 'ట్యాక్సీ మస్తాన్' అని, బుజ్జి అనే వ్యక్తి కూరగాయల దుకాణం నిర్వహిస్తుంటే 'కూరగాయల బుజ్జీ' అనీ నామకరణం చేసేస్తారు. ఇక తిరుమలలో ఉండే వ్యక్తినేమో 'కొండా యన'గా పిలుస్తారు.

ఎలబారినారు (వెళ్లినారు), సమళిచ్చేవాళ్లు (సమాధానమిచ్చేవారు), సినిమాకొటాయ్ (థియే టర్), ఉర్లగడ్డ (ఆలుగడ్డ), ఎర్రగడ్డ (ఉల్లిపాయ), తెల్లగడ్డ (వెల్లుల్లి), కుశాల (బాగున్నావా), ఒక్కరవ్వ (కొద్దిగా)... ఇక్కడ బాగా వ్యవహారంలో ఉండే మాట లివి. తిరుపతిని 'తిరప్తి'గా, తిరుమలను 'కొండ'/ 'మలై'గా వ్యవహరిస్తారు. ఇక సమయానికి సంబం ధించి కాల్(పావుభాగం),ముక్కాల్ (ముప్పావు) లాంటి పదాలు వినపడతాయి. 'రెండు కాల్' అంటే రెండుంబావు, 'మూడు ముక్కాల్' అంటే మూడూ ముప్పావు.

మాకు తెల్సులే అబ్బీ ఇళ్లకు వేసే తాళాన్ని బీగం అని పిలుస్తారు. 'ఇంటికి బీగాలు బాగా వేసి నవా' అని పెద్దవాళ్లు చిన్నవాళ్లని అడుగుతుంటారు. గ్రామీణ ప్రాంతాలకు చెందినవాళ్లతో మాట్లాడే టప్పుడు, వాళ్లకు తెలిసిన విషయాన్ని మళ్లీ చెబితే 'ఆఁ మాకు తెల్సులే అబ్బీ' అని చెప్పినవారినే ఆట పట్టిస్తారు. ఇక 'వారుకొన్నాడు' అంటే బాగా సంపాదిం చాడని

అర్థం. 'వెంకటముని చిల్లరంగడి పెట్టి బాగా వారుకొన్నాడు' అంటే ఆ వెంకటముని అనే ఆయన చిల్లరకొట్టు పెట్టుకుని బాగా ఆర్జించాడని చెబుతున్నారన్న మాట.

జిల్లాలో వినపడే కొన్ని సామెతలు హాస్య స్ఫోరకంగా ఉంటూనే వాస్తవాలను ప్రతిబింబిస్తాయి. 'ఎన్ని పుంగనూర్లయితే ఒక బెంగళూరు' అనే సామెత ఒకటి ఇక్కడ వ్యవహారంలో ఉంది. పుంగనూరు అనేది జిల్లా పశ్చిమ ప్రాంతంలోని ఓ పట్టణం. బెంగళూరు మహానగరమని తెలిసిందే. అంతటి నగరాన్ని నిర్మించడానికి పుంగనూరు లాంటి పట్టణాలు ఎన్ని కావాలని అర్థం. విస్తృతార్థంలో చూస్తే, ఎన్ని గడ్డిపోచలు కలిస్తే ఓ తాడు అవుతుందని.

'దిల్లీతో కొట్లాడొచ్చు' అనే మరో జాతీయమూ ఆసక్తికరంగా ఉంటుంది. ఆర్థికంగా ఉన్నతస్థితిలో ఉన్నవారి గురించి చెప్పేటప్పుడు దీన్ని వాడతారు. దేశ రాజకీయాలకు, పరిపాలనకు కేంద్రస్థానం దిల్లీ. దాంతో కొట్లాడగల స్థాయిలో అతని దగ్గర డబ్బు ఉందన్నది భావం. డబ్బుంటే ఏదైనా సాధ్యమవుతుందన్నది దీని అంతరార్థం.

ఇంటి కాడ, బాయి కాడ, చేను కాడ 'మీ ఆయన ఎక్కడున్నాడు అమ్మీ' అంటే 'బాయి కాదున్నాడునా' అని సమాధానమిస్తుంది ఓ పల్లెపడుచు. బావి దగ్గరున్నాడని అర్థం. దగ్గరికి బదులుగా 'కాడ' అంటారు. అలాగే, భర్తను 'ఇంటాయన'గా వ్యవహరిస్తారు. 'ఏమ్మేయ్ బుజ్జీ మీ ఇంటాయన వచ్చాడు' అంటూ అల్లుడి గురించి కూతురుకు చెబుతుందో ఓ అత్త. ఎక్కడికైనా వెళ్తొస్తుంటే 'యాడికి పోయినావు' అని అడుగుతారు. 'ఎక్కడ'కు మారుగా 'యాడ' వినియోగం ఎక్కువ ఇక్కడ. జిల్లాలో పలు గ్రామ దేవతల జాతర్లతో పాటు ధర్మరాజు, ద్రౌపదమ్మల తిరునాళ్లూ జరుగుతుంటాయి. ఈ ఉత్సవాల్లో గ్రామీణ భాష గుబాళిస్తుంది. ఎవరినైనా సరే, ఎంతో ఆప్యాయంగా వరసలతో పిలిచే ఇక్కడి సంస్కృతి ఆకట్టుకుంటుంది. ఎవరైనా పెద్దవయసువారు కనపడితే పెద్దాయన/ పెద్దామె అనడం సాధారణం. కొత్తవాళ్లని 'ఏంబా'/ 'ఏమబ్బా' అని పలకరిస్తారు. దంపతులు కూడా 'ఏంబా' అంటూ సంభాషించు కుంటారు. అనంతపురం జిల్లా సరిహద్దు ప్రాంతాల్లో 'ఏమప్పా' పిలుస్తారు. మహిళలు పురుషులను 'అన్నా' అని సంబోధిస్తారు. 'ఏవన్నా చానా దినాలైంది నిన్ను చూసి' అనడంలో ఎంతో ఆప్యాయత ధ్వనిస్తుంది.

చిత్తూరు జిల్లాకు దక్షిణంవైపు తమిళనాడు ఉంటుంది. ఆ రాష్ట్రానికి చెందిన పలువురు ఉపాధి కోసం ఈ జిల్లాకు వస్తుంటారు. తిరుపతి, నగరి, పుత్తూరు, చిత్తూరు తదితర ప్రాంతాల్లో వీళ్లు నివసిస్తుంటారు. దాంతో చాలా తమిళ పదాలు ఇక్కడి తెలుగులో కలిసిపోయాయి. అలాగే ఆయా ప్రాంతాల స్థానికులకూ తమిళ భాష మీద పట్టు ఉంటుంది. వాళ్లూ తమిళ మాటలను విరివిగా వాడుతుంటారు. ముఖ్యంగా వరుమానం (జీతం), వేళకారు (ఉద్యోగి), కడవులే (దేవుడు), పెరుమాళ్ (వేంకటేశ్వరుడు), అన్నాచ్చి (అన్న), అని (వదిన), చిత్తప్ప (చిన్నాయన), అంబలా పసంగల్ (అబ్బాయిలు), పొంబలా పసంగల్ (అమ్మాయిలు), తెరువు (వీధి) లాంటివి. 'ఎన్నబా ఎన్న సమాచారం' అంటే 'ఏంబా సంగతులేంటి' అని అర్థం. 'పండగను అమక్కళంగా చేస్తారు' అంటుంటారు. అంటే 'ఆర్భాటంగా చేస్తార'ని భావం. చేపల మార్కెట్‌ను 'మీన్ మార్కెట్' అని, ఎండుచేపలను 'కరువాడ్' అనీ పిలుస్తారు.

ఇక్కడ ఇంకో రకమైన భిన్నమైన వాతావరణం కనిపిస్తుంది. తమిళపదాలను తెలుగు మాటలతో కలిపి వాడుతుంటారు. 'అన్నం తిన్నావా'కు మారుగా 'ఎన్నాబా సోర్ సాపాటుయా' అని అడుగుతారు. తిరుమల, తిరుపతుల్లో తమిళ ఆగమాలు ఇప్పటికీ వ్యాప్తిలో ఉన్నాయి. అందుకే ఆలయాల్లోనూ తమిళ సంబంధమైన పేర్లు అనేకం వినిపిస్తుంటాయి. వెంకన్నగుడిని పెరుమాళ్ కోయిల్ అంటారు. తిరు మల నుంచి

ఎవరైనా గుండుతో వస్తే 'ఎన్నాబా మొట్ట అడిచ్చిట్టియా' అని సంబోధిస్తారు. తమిళ ప్రాబల్య మున్న గ్రామాల్లో 'నాట్టామై' వ్యవస్థ ఉంది. 'నాట్టామై' అంటే గ్రామపెద్ద. ఆయన మాటలకు ఇప్పటికీ ఆ గ్రామప్రజలు విలువ ఇస్తారు. వీధుల్లో చిన్నచిన్న తగవులు ఏర్పడినప్పుడు సవాళ్లు విసురుకోవడం ఎక్కడైనా ఉండేదే. అయితే ఇక్కడ మాత్రం 'నడకరదే వేరుడా' అని సవాల్ విసురుతారు. 'పర్యవసనాలు తీవ్రంగా ఉంటాయి' అని హెచ్చరించడమన్న మాట. దీనికి ప్రతిసవాల్‌గా 'పాతుకిటే' అంటారు– అంటే చూసుకుంటామని! అయితే ఈ మిశ్రమ భాష వ్యవ హారంలో ఉండేది పట్టణ ప్రాంతాల్లోనే. గ్రామాల్లో స్వచ్ఛమైన తెలుగే వినపడుతుంది. తరతరాలుగా ఇక్కడే ఉంటున్న తమిళు లు రెండు భాషలనూ మాట్లాడగలరు.

పలమనేరు, బైరెడ్డిపల్లి, కుప్పం, మదనపల్లి తదితర ప్రాంతాల మీద కన్నడ భాష ప్రభావం ఎక్కువగా ఉంటుంది. కుప్పం, పలమనేరు ప్రజలకు తెలుగు, తమిళం, కన్నడ భాషల్లో ప్రవేశముంటుంది. ఇక్కడికి వస్తే 'చెన్నగిదిర' అని పలకరిస్తారు. అంటే 'ఎలా ఉ న్నావు?' అని అర్థం. బేడ (వద్దు), బేకు (కావాలి), కల్సామాడు (పనిచూడు), సాకు (చాలు) అనే పదాలు రోజువారీ సంభాషణల్లో వినవస్తుంటాయి. 'భోజనం చేశావా' అనేందుకు 'వూటా అయిత్తా' అంటారు. అయితే, ఇతర భాషల ప్రభావం ఎంత ఉన్నాసరే, తనదైన సొగసును మాత్రం పోగొట్టుకోని అమ్మభాష ఇక్కడివాళ్ల సొంతం. మధురాంతకం రాజారాం, కేశవరెడ్డి, నామిని తదితరుల రచనల్లో చిత్తూరు తెలుగు గుబాళిస్తుంటుంది. మొత్తమ్మీద తెలుగు భాషాధ్యయన కోణంలో చూస్తే చిత్తూరు జిల్లా ఓ విలక్షణ ప్రాంతం.

వెంకన్నవైభోగం అందరికీ తెలిసిందే. ఆయన సన్నిధానం నిత్యకల్యాణం పచ్చతోరణంగా కళకళలాడు తుంటుంది. అయితే, తిరుపతిలోని గోవిందరాజుల స్వామి ఆలయమూ ప్రాచీనమైందే. కానీ, ఆదాయం ఎక్కువగా ఉండదు. మరోవైపు భక్తులు, పర్యాటకులు ఎవరొచ్చినా మొదట ఆ రద్దీని భరించేది కొండకింది తిరుపతే. కానీ, వాళ్లు సమర్పించే దక్షిణలన్నీ కొండ మీది స్వామికే పోతాయి. అందుకే ఈ రెండు విషయా లనూ కలిపి సరదాగా చెబుతూ 'గోల గోవింద రాజులుది, ముడుపులు వెంకటేశులువి' అంటారు.

## దేవులపల్లి అంటే . . .

భావకవిత్వపు ప్రయోక్తా, ప్రచారకుడూ,
కృష్ణపక్షానికి వెలుగుల ఱేడు,
తెలుగుతనానికి సూటితనాన్నీ,
సాహిత్యం కమ్మతనాన్నీ కలిపి
చిత్రసీమను సేవించిన స్వరార్చకులు.
దేవుని ఉనికిపట్ల ఉపేక్ష వహిస్తూనే
నిరాకారుణ్ణి భజించిన భక్తకవి.
దేశంలో మతంపేరిట జరిగే
దారుణ మారణ కాండను
"మతం వద్దు – గితం వద్దు
మారణ హోమం వద్దు" అంటూ
ఎలుగెత్తి జాతిమతాల సమైక్యతను
చాటిన లౌకికవాది.
'ఆకాశము నొసట పొడుచు
అరుణారుణ తార' అంటూ
ఆగామి కాలాన్ని ఊహించిన ఆశావాది.
సాహిత్యంలోని అన్ని ప్రక్రియలనూ
'శాస్త్రీయ' ముద్రతో సుసంపన్నం చేస్తూ
పలు గ్రంథాలను వ్రాసిన రసవాది.
1964నుండి మూగవోయిన గొంతుతో
మౌనరాగాలు ఆలపించిన వాగ్గేయకారుడు.
స్వేచ్ఛా సమానత్వాల బావుటాలెత్తిపట్టిన
కాల్పనిక కవిత్వంతో ప్రారంభించి
ప్రగతిశీల సాహిత్యపు తాత్వికతను ఆహ్వానించి
కొన్ని దశాబ్దాలపాటు తెలుగు కవిత్వ వడినీ,
కవుల నడవడినీ ప్రభావితం చేసిన కులగురువు.

# 'చచ్చినట్టు' బతికించే భాష!

తెలుగువాడికి సాటి ఇంకొకడు లేడు. అందరిదీ ఒక దారైతే మనవాడిది ఇంకోదారి! అందరూ పొగ పీలిస్తే తెలుగువాడు పొగ తాగుతాడు. ఇంతేకాదు తెలుగువాడు దెబ్బలు 'తింటాడు'. దెబ్బలు ఏమైనా తినే పదార్థాలా? అంటే ఉలకడు పలకడు.

సంస్కృతం అమరభాష అంటారు. దాని సంగతేమో కానీ తెలుగు మాత్రం కచ్చితంగా అమరభాషే! ఇందుకు ఉదాహరణలు ఉన్నాయి. ఎవరి మీద అయినా ప్రేమ వచ్చినా, కోపమొచ్చినా 'సచ్చినోడా' అని తెలుగువాడు పిలుస్తాడు. 'సచ్చినోడు' ఎలా పలుకుతాడని ఆలోచించడు. చచ్చినా ఒప్పుకోను అంటాడు. చస్తే ఎలా ఒప్పుకుంటాడు? చచ్చినాక ఒప్పుకుని చూపించిన వాడు ఒక్కడైనా ఉన్నాడా? ఆశ చావడం లేదంటాడు. చెట్లకే ప్రాణం ఉ ందని చెప్పుకుని చావనివాళ్లు ఇంకా ఉన్నారు. అలాంటి వాళ్లు ఆశకు ప్రాణం ఉంటుందని ఎలా ఒప్పుకుని 'చస్తా'రు? తెలుగువాడు కంటి చూపుతో చంపేస్తాడు. అతడి శక్తి అలాంటిది. ఇలాంటి అతీత శక్తులు యావత్ ప్రపంచంలో తెలుగువాడికి మాత్రమే ఉన్నాయి. ఎంత గొప్ప! ఎంత చిత్రం!

మత్తు పానీయాలైన సారా, బ్రాందీ, విస్కీలను 'సేవిస్తున్నా'నంటాడు. అదే సమయంలో మంచినీళ్లు తాగుతున్నానంటాడు తప్ప సేవిస్తున్నాననడు. ఇదేం చిత్రమో! ఇంకా చిత్రమేంటంటే మందు 'కొడుతున్నా' నంటాడు. కొట్టడానికి మందేమన్నా మనిషా? పశువా? బాతాఖానీ కొట్టకు అంటాడు. దీని పరిస్థితీ ఇదే. అనారోగ్యకరమైన నిషా పానీయాన్ని ఆరోగ్యప్రదాయిని అయిన మందు పేరుతో పిలుస్తాడు! అంతా 'మందే' అనుకునేవాడు తప్ప ఇంకెవ్వడైనా ఈ పని చేయగలడా? తెలుగువాడు ఎందులోనైనా ఆటను చూడగలడు. మాట్లాడ తానంటాడు. పోట్లాడతానంటాడు. మన స్ఫూర్తిగా కోరుకుంటున్నానంటాడు. మనసు పూర్తిగా కాకుండా అందులో ఏభైశాతమో, డెబ్భైఅయిదుశాతమో ఉంచి కోరు కుంటాడా ఏంటి? ఇంకోమాట!హృదయపూర్వకంగా బెడితే, అభినందించే అవకాశం ఉందా? ఉంటుందా?

తెలుగువాడి 'న్యాయమే' వేరు. బడాయి గానీ మాట మాట్లాడితే 'మనస్సాక్షిగా' అంటాడు. మనసుకు ఏమన్నా రూపం ఉందా? మాట ఉందా? వచ్చి సాక్ష్యం చెప్పడానికి! అగ్నిసాక్షిగా పెళ్లాడాను అని కూడా అంటాడు. అగ్ని ఏదో చిటపటలాడుతుంది కానీ ఎవరైనా సంసారంలో చిచ్చుపెడితే అదొచ్చి అడ్డుపడు తుందా ఏంటి? కళ్లలో నిప్పులు పోసుకుంటున్నా డంటాడు! పోసుకోమనండి చూద్దాం! పెళ్లికాని ఆడ పిల్లను గుండెల మీద కుంపటి అంటాడు. ఇది ఎంత తప్పు! గుండెలమీద కుంపటి పెట్టుకున్న మొనగాళ్లు యావత్ భూప్రపంచంలో ఎవరైనా ఉన్నారా? మాటేగా ఏదైనా అంటాడు. గుండె మీద బరువు తగ్గించుకున్నా నంటాడు. గుండెల మీద బట్టల బరువు తప్ప ఇంకేం బరువు ఉంటుంది! నవ్వితే నవరత్నాలు రాలతా యంటాడు. రత్నాలా పాడా? మరీ గట్టిగా నవ్వితే పళ్లు రాలిపోతాయేమో! చిటికెలో పని అయిపోతుం దంటాడు. అతిశయం కాకపోతే చిటికె వేస్తే శబ్దం అవుతుంది కానీ పని ఎలా అవుతుంది!

ఒట్టిమాటలు కట్టిపెట్టోయ్ అని గురజాడ చెప్పినా మనవాళ్లు వినరు. అప్పు తీసుకునేటప్పుడు 'నీ డబ్బు వడ్డీతో సహా పువ్వుల్లో పెట్టి ఇస్తా' నంటారు. వడ్డీ ఇస్తే ఇవ్వచ్చుగానీ పువ్వుల్లో పెట్టి ఇచ్చినవాడు ఎవడైనా ఉన్నాడా? ఇది అప్పిచ్చిన పిచ్చివాడి చెవిలో పువ్వు పెట్టడం కాదూ! ఎవరో చిన్నచూపు చూస్తున్నారని తెలుగువాడు ఆక్షేపిస్తాడు. దూరపు చూపు, దగ్గరి చూపు ఉంటాయి తప్ప చిన్న చూపు, పెద్ద చూపు అని ఎక్కడైనా ఉంటాయా? వంట చేయడాన్ని చేయి కాల్చుకోవడం అంటాడు. ఇదే నిజమైతే ఆడవాళ్ల చేతులన్నీ ఏమై పోయేవి!

సంగీతమంటే చెవికోసుకుంటానని ఒక్కొక్కరు వంకర్లు తిరిగిపోతుంటారు. అయితే అతడు ఎంతసేపు పాటలు వింటున్నా కోసుకున్న చెవి కిందపడదే అని నిరాశ పడ్డవాళ్లూ ఉన్నారు. తప్పు చేసినవాడు అడ్డంగా దొరికిపోయాడు అంటారు. దొరికినవాడెవడైనా అడ్డంగా

దొరుకుతాడా? నిలువుగా దొరుకుతాడు తప్పు. అన్నట్టు గిట్టనివాణ్ని అడ్డమైనవాడు అని తిడతారు. అదేంటి? దాని భావమేంటి? పండితార్థం ఏమైనా పిండితార్థం ఒకటుంది. పశువా అని తిట్టినట్టు. మనుషులు నిలువుగా ఉంటారు. పశువులు అడ్డంగా ఉంటాయి. అదీ సంగతి! ఎవడి మీదైనా కోపం వస్తే ఏ మొహం పెట్టుకుని వచ్చావంటాడు తెలుగువాడు. ఎవడికైనా ఒకటే ముఖం ఉంటుంది కానీ బ్రహ్మలాగా నాలుగు ముఖాలు, రావణబ్రహ్మలాగా పది ముఖాలు ఉండవు కదా! ఫలానావాడు తలలు మార్చేరకం అనేది కూడా తెలుగువాడి వాడుక. ఇదెలా సాధ్యం? వినాయక వృత్తాంతంలోలాగా తలలు మార్చేశక్తి సామాన్య మానవులకు ఉంటుందా?

తెలుగువాడు బండ చాకిరీ చేస్తానంటాడు. బండ దాని మొహం! ఎక్కడ పడేస్తే అక్కడే ఉంటుంది కానీ అది చేసే చాకిరీ ఏముంటుంది? ఏముంది ఎడమ చేత్తో చేస్తానంటాడు. ఎడమ చేత్తో చేసే పనులేంటో అందరికీ తెలుసు. దానితో అన్ని పనులూ అతివేగంగా చేస్తానంటే ఎలా కుదురుతుంది? అన్నం ఉడకలేదా అంటాడు. ఇదేంటి? ఉడికితే కానీ అన్నం కాదుకదా! జోకులు పేల్లేదు అంటాడు. జోకు ఏమైనా బాంబా? పేలడానికి! వీపు విమానం మోత మోగుతుందని అంటాడు. విమానం మోత మోగితే ఆ వీపు అసలు ఉంటుందా? మనిషి అసలు ఉంటాడా? లేస్తే మనిషిని కానంటాడొకడు. మరి లేచిన వాళ్లందరూ ఏంటి? అలాంటప్పుడు కూర్చుని ఉంటేనే మేలుకదా! శక్తిని కూడా భక్తికి ముడి పెట్టడం తెలుగువాడికి రివాజు. ఉన్న పూజలు చాలక బడితెపూజ ఒకటి.

జంతువుల్లో కూడా దేవుళ్లను చూసుకుని భారతీయులు ఆరాధిస్తారు. ఇందుకు తెలుగువాడు కూడా మినహాయింపు కాదు. ఎటొచ్చీ మనుషుల్లో జంతువుల్ని చూడటం అతగాడి ప్రత్యేకత. గిట్టనివాళ్లను పంది, కుక్క,గాడిద అని తిట్టే తెలుగువాడు, ఇష్టమైన వాణ్ని పులి,సింహం,గుర్రం అని అభిమానంగా చూస్తాడు. పిలుస్తాడు.

ఏదైనా కళ్లారా చూస్తే తప్ప నమ్మకూడదు. తెలుగు భాష ఇందుకు ఇంపు అయిన మినహాయింపు. గుండె జారిపోయింది అంటారు. ఇప్పటివరకు ఎవరి కైనా జారిపోయిందా? లేదే! నీ నోరు పడిపోను అని తిట్టి పోస్తారు. ఎవరి నోరయినా ఎప్పుడైనా పడిపోవడం చూశామా? పాడమని అడిగితే గాయకులు గొంతు పోయింది అంటారు. గొంతు ఎక్కడికి పోతుంది? పోతే ఎవరు తీసుకురాగలరు? నోరు పారేసుకోవడం అంటారు. అది ఎలా సాధ్యం? మా ఆయనకు నోట్లో నాలుకలేదని ఓ ఇల్లాలు వాపోతుంటుంది. నోట్లో నాలుక లేకుండా మనిషి ఎలా ఉంటాడు? 'వాసన చూడు' అంటారు. వాసనను పీలుస్తారు కానీ ఎలా చూస్తాం? రుచి చూడటం కూడా అంతే. ఎవరు చూడగలరు?

పత్రికలు చదివి చదివి వాటిలోని పడికట్టు మాటలను కంఠస్థం చేసేశాడు తెలుగువాడు. ఫలానా వాడు బాధకు గురయ్యాడు అంటాడు. మధ్యలో గురి ఎందుకు? బాధపడ్డాడు అనొచ్చుగా. దిగ్భ్రాంతి వ్యక్తం చేశాడంటారు. దిగ్భ్రాంతి చెందాడు అనడు. దిగ్భ్రాంతిని ఎలా వ్యక్తం చేస్తాడంటే చెప్పడు. తప్పు చేస్తే పాపం అంటాడు సరే. ఎదుటివాడు కష్టాల్లో ఉంటే అయ్యో 'పాపం'! అంటాడు. తెలుగు భాష ఏమన్నా పుణ్యానికి వచ్చిందా ఏంటి?

'దేశ భాషలందు తెలుగు లెస్స' అని శ్రీకృష్ణ దేవరాయలు చెప్పాడని గొప్పగా చెబుతాం. ఇంగ్లీషు మాటలు తెలుగులో కలవని రోజుల్లో అన్న మాటలివి. తెలుగంతా ఇంగ్లీషుమయం అయిన ఈ రోజుల్లో అయితే 'ప్రపంచ భాషలందు తెలుగు లెస్స' అనక తప్పదు.

తమిళుడు తన భాషలో మాట్లాడుతుంటే తమిళుడికి తప్ప ఇంకొకరికి అర్థం కాదు. బెంగాలీ తన భాషలో మాట్లాడుతుంటే బెంగాలీకి తప్ప ఇంకొకరికి అర్థం కాదు. తెలుగు తప్ప భారతీయ భాషలన్నీ అంతే. మరి తెలుగువాడో.. తెలుగు అని చెప్పి మాట్లాడుతుంటే అన్ని భాషలవాళ్లకూ ఎంతో కొంత అర్థమవుతుంది. ఇందుకు ఇంగ్లీషు, ఉర్దు, తమిళం, కన్నడం, హిందీ లాంటి సమస్త భాషలూ ఇందులో 'గూడు' కట్టుకునో భవనం కట్టుకునో ఉంటాయి. ఇంగ్లీషు మాత్రం ఇంతకన్నా పొడిచిందేముంది? ఇది తెలుగువాడి వ్యూహం. అందువల్ల తెలుగు మనుగడకు ఎట్టి పరిస్థితిలో ఢోకా రాదు.

తెలుగు భాషా జిందాబాద్

# ఈ అలవాట్లను వదిలితేనే అభ్యున్నతి

వ్యక్తి నిరంతరం తాను 'ఉన్న స్థితి నుండి ఉన్నత స్థితి'కి చేరడమే అభ్యున్నతి. అదే జీవన సాఫల్యం. ఈ ప్రయాణంలో ఎదురయ్యే.. అతినిద్ర, బద్ధకం, భయం, క్రోధం, అలసత్వం, ఎడతెగని ఆలోచన ...అనే ఈ ఆరుదోషాలను జయించినప్పుడే లక్ష్యాన్ని చేరగలుగుతాడని భారతం చెబుతోంది. భారతంలోని ఉద్యోగ పర్వంలో విదురుడు చెప్పిన మాటలివి. నిజానికి జీవితం మన భావోద్వేగాలకు అనుకూలంగా నిర్మించబడిలేదు. మన భావోద్వేగాలూ జీవితాన్నీ మార్చలేవు. ప్రతి ప్రయాణం గమ్యాన్ని చేరుస్తుందని చెప్పలేం. కానీ, ప్రయాణించిన దూరం గమ్యాన్ని దగ్గరగా చేస్తుంది. అనుకున్నది జరగడం, జరగకపోవడం సంభవమే. విజయంలో పొంగిపోతే అహంకారం పలకరిస్తుంది. అపజయంలో క్రుంగిపోతే ఆత్మన్యూనత వరిస్తుంది. మన ఉన్నతికి విఘాతం కలిగించే దోషాలను వదిలివేయడం, లోపాలను సవరించుకుంటూ, ముందుకు సాగడంవల్ల పరిణతి ఉన్నతి లభిస్తాయి.

ఈ క్రమంలో పైన చెప్పిన ఆరు దోషాలను విశ్లేషించుకుంటే..

నిద్రలో శరీరం విశ్రాంతమౌతుంది. ప్రాకృతిక శక్తి మనలోకి ప్రవేశించి శక్తిమంతులను చేస్తుంది. కానీ.. అతినిద్ర లేదా నిద్ర లేమి వల్ల ఆరోగ్యం పాడవుతుంది. ఆరోగ్యమే మహాభాగ్యం. అది చెడిపోతే అన్నీ పోయినట్లే.

రెండో లక్షణం బద్ధకం. ఇష్టమయిన దాని కోసం అవసరమైన దానిని వదిలివేయడం బద్ధకం. దానివల్ల వాయిదా వేసే జబ్బు కలిగి, సమయానికి ఏ పనీ పూర్తిచేయలేం.

అనుకోని పరిస్థితులు ఎదురైతే వాటిని అనుమోదించలేని సమయంలో కలిగేది భయం. భయం వల్ల ఏ పనిని సంకల్పించినా.. "ఇది నాకు సాధ్యపడుతుందా.. అపహాస్యం పాలవుతానేమో... అపజయం కలుగుతుందా" అనే అనుమానాలు వెన్నాడుతూ ఉంటాయి. అనుమానాల వల్ల ఉత్సాహం తగ్గుతుంది, ధైర్య సాహసాలు సన్నగిల్లుతాయి. బుద్ధి పనిచేయదు, శక్తి సామర్థ్యాలు మందగిస్తాయి. ప్రయత్నం మధ్యలోనే విడిచిపెడతాం.

ఇక.. క్రోధం అన్ని అనర్థాలకూ మూలకారణం. పరిస్థితులు మనం అనుకున్నట్లుగా లేనప్పుడు కోపం వస్తుంది. కోపం మనలోని భావోద్వేగానికి సంకేతం. కోపం దీర్ఘమైతే క్రోధంగా మారుతుంది. క్రోధం వల్ల మోహం కలుగుతుంది. మోహం వల్ల స్మృతి తప్పుతుంది. దాని వల్ల బుద్ధి సరిగా పనిచేయదు.

అలసత్వం వల్ల విద్య దక్కదు. విద్య లేనివానికి ధనం లేదు, ధనం లేక మిత్రులు ఉండరు, మిత్రులు లేకపోతే సుఖమూ ఉండదు.

అలాగే..

ఎడతెగని ఆలోచనల వల్ల కార్యరంగంలోకి దిగడం కుదరదు. ఈ ఆలోచనలు ప్రతిబంధకాల వైపు మాత్రమే నడిపిస్తాయి. ప్రణాళికలు రూపొందాలంటే ఆలోచనలు అవసరమే కానీ, అవి ఆచరింపబడితేనే విజయం. ఇలా ఈ ఆరు దోషపు అలవాట్లను వదిలితేనే అభ్యున్నతి ఉంటుంది.

జె శ్రీమన్నారాయణ

మనం మనుషులమైతే మన నేల తెలుగు నేల, మన భాష తెలుగు భాష

# వేదార్థచూడామణి, స్వాధ్యాయరత్న

# బ్రహ్మశ్రీ గుళ్ళపల్లి సీతారామచంద్రమూర్తి ఘనపాఠీ గారికి

# భారతాత్మ అశోక్ సింఘాల్ వైదిక పురస్కారం

రాజమంద్రి నగరానికి చెందిన కొంతమూరులోని ప్రసిద్ధ శ్రీ దత్తాత్రేయ వేదవిద్యా గురుకులం ప్రధానాచార్యులు బ్రహ్మశ్రీ గుళ్ళపల్లి సీతారామచంద్రమూర్తి ఘనపాఠీగారికి ప్రతిష్ఠాత్మకమైన "భారతాత్మ శ్రీ అశోక్ సింఘాల్ వైదిక పురస్కారం" సింఘాల్ ఫౌండేషన్‌వారు ఢిల్లీ చిన్మయమిషన్‌లో ఏప్రియల్ 18వ తేదీన లోక్‌సభ స్పీకరు శ్రీ ఓం బిర్లా సమర్పించారు. ఈ అవార్డుగ 'ఆదర్శ వేదాధ్యాపక' బిరుదుతో పాటు ప్రశంసాపత్రము, జ్ఞాపిక, ఐదు లక్షల నగరు సమర్పించారు.

విశ్వ హిందూ పరిషత్ పూర్వాధ్యక్షులైన శ్రీ అశోక్ సింఘాల్ పేరిట ఏర్పాటైన 'సింఘాల్ ఫౌండేషన్' వారు దేశవ్యాప్తంగా పేరొందిన వేదపండితులను ఆహ్వానించి ఈ పురస్కారం అందిస్తుంటారు. మన తెలుగు ప్రాంతం నుంచి ఈ ప్రతిష్ఠాత్మక పురస్కారాన్ని అందుకున్న తొలి వేదపండితులు బ్రహ్మశ్రీ సీతారామచంద్రమూర్తిగారు కావడం తెలుగువారికి అందునా గోదావరి జిల్లావాసులకు గర్వకారణం.

ఇరగవరం వాస్తవ్యులైన గుళ్ళపల్లివారు నేటికీ వైదికవిద్యలో సుప్రసిద్ధులు. ఆ ప్రసిద్ధులలో బ్రహ్మశ్రీ ఆంజనేయఘనపాఠీగారొకరు. వారి శ్రీమతి ఎగ్గెమ్మగారు. వారికి 12 మంది సంతానం. అందులో 1966 ఫిబ్రవరి 15వ తేదీన మూడవ సంతానంగా మన సీతారామ చంద్రమూర్తిగారు జన్మించారు. కీ.శే. ఆంజనేయ ఘనాపాఠీగారు వేదతపస్వి, కాశీపండిత బిరుదాంకితులు. రాష్ట్రపతి పురస్కార గ్రహీతలు. వంశపారంపర్యంగా వైదికాధ్యయనమే ఆచారంగా కలిగిన కుటుంబంలో వారైన బ్రహ్మశ్రీ సీతారామచంద్రమూర్తిగారు కృష్ణ యజుర్వేద సలక్షణ ఘనాంతం, వేదాంగములు, సంపూర్ణ విద్యారణ్య భాష్యం, శాస్త్రప్రకరణ గ్రంథములు, శ్రౌత స్మార్తములు, ప్రస్థానత్రయ శ్రీ శంకర భాష్యము, గీతాసూత్ర ఉపనిషత్ భాష్యములు, ధర్మ శాస్త్రములు క్షుణ్ణంగా అధ్యయనం చేసిన మహాపండితులు.

వేదవిద్యకే జీవితాన్ని అంకితం చేసిన ఈ మహనీయులు 2000 సంవత్సరము అక్టోబర్ 29వ తేదీని రాజమంద్రి ఆర్యాపురంలో వేదపాఠశాలను ప్రారంభించడం జరిగింది. అది దినదిన ప్రవర్ధమానమై వైదిక విద్యావ్యాప్తికి, పునర్వైభవానికి ఆలవాలమై వెలుగొందుతోంది. వామనునిగా ప్రారంభమైన ఆ విద్యాలయం నేడు సువిశాల ప్రాంగణంలో సమస్త సదుపాయాలతో తన విశ్వరూపాన్ని ప్రదర్శిస్తోంది. ఆచరణలేని బోధన ఆదర్శనీయం కాదు. ఆ భావంతోనే గుళ్ళపల్లివారు వైదిక జీవనవిధానాన్నే పాటిస్తూ అందరికీ ఆదర్శప్రాయులై ఉన్నారు. విదేశాలకు వెళ్ళడానికి అవకాశమొచ్చినా, ఆహ్వానమందినా ప్రాచీన సంప్రదాయానికి కట్టుబడ్డ మన ఘనాపాఠీగారు నిర్ద్వంద్వంగా దానిని తిరస్కరించారు.

ఎంతటివారైనా ఆయన నిరాడంబర జీవన విధానానికి ఆకర్షితులై పాదాభివందనం చేయాల్సిందే. ఎందరో వైదిక విద్యా సంరక్షకులు, ఆధ్యాత్మిక సంస్థలు, సేవాభావం కలవారు ఘనాపాఠీ గారిని ఆహ్వానించి ఘనంగా సత్కరించారు. బిరుదులతో గౌరవించారు. శ్రీశ్రీశ్రీ శృంగేరీ పీఠాధీశులు భారతీతీర్థ మహాస్వామివారి సమక్షంలో 'వేదవిద్యాలంకార' బిరుదునందుకున్నారు. 1922లో ముంబయి ఆంధ్ర మహాసభవారు ఆహ్వానించి ఘనంగా సత్కరించారు. వీరి బిరుదులు పట్టికను తయారుచేయుట అంత సులభమైనదేమీ కాదు. అయినా కొన్నిటిని తెలుసుకుందాం -

స్వాధ్యాయరత్న, వేదార్థప్రకాశక, వేదభాస్కర, వేదాచార్య, ఆమ్నాయ విద్వన్మణి, వేదవిద్యానిధి, వేదజ్యోతి, భారతజ్యోతి, ది బెస్ట్ సిటిజన్ ఆఫ్ ఇండియా, ఆమ్నాయ వాచస్పతి, వేదార్థ చూడామణి, వేదవిద్యా వాచస్పతి వంటి అనేక బిరుదులను దేశంలోని అనేక రాష్ట్రాలలోని వేరు వేరు సంస్థలు ఘనంగా సత్కరించి ప్రదానం చేసాయి. 2011లో కాంచీపురంలోని వేదరక్షణనిధి ట్రస్ట్‌వారు 'ఉత్తమ అధ్యాపక' పురస్కారం అందజేసారు. 2018 లో తెలంగాణలోని జియర్ ఎద్యుకేషనల్ ట్రస్ట్ అవార్డు నిచ్చి గౌరవించింది. 2019 లో మైసూరులోని అవధూత దత్తపీఠం 'వేదనిధి' పురస్కారంతో సత్కరించింది.

రాజమంద్రి విచ్చేసిన ఆధ్యాత్మిక ఆసక్తిపరు లెవరైనా తప్పక ఈ వేదవిద్యాలయాన్ని సందర్శించడం అభ్యాసంగా చేసుకుంటారు. శృంగేరీ పీఠాధిపతులు, కంచి కామకోటి పీఠాధిపతులు, అహోబిలం జియర్ స్వామి, చిన జియర్ స్వామి, సద్గురు శివానందమూర్తి, అప్పటి ఆంధ్ర గవర్నర్ నరసింహన్, రిజర్వు బ్యాంకు మాజీ గవర్నరు డి.వి. సుబ్బారావు ఇలా ఎందరో వదాన్యులు, అధికార, రాజకీయ ప్రముఖులు ఈ దత్తాత్రేయ విద్యాగురుకులాన్ని సందర్శించారంటే దానికి ప్రధాన కారకులు బ్రహ్మశ్రీ సీతారామచంద్రమూర్తిగారి నిర్వహణ సామర్థ్యమే అనడంలో సందేహం లేదు. వారికి ఆ పరమేశ్వరుడు కటాక్షించి దీర్ఘ ఆయురారోగ్యము లిచ్చి కృప చూడాలని వేడుకుంటున్నాము.

# 'నత్వం శోచితుమర్హసి'

- Mutya Ramesh

ఏమనిషైనా కోరుకునేది ఆనంద కరమైన జీవితం. శోకానికి తావులేని విధంగా బ్రతుకు గడపాలని ఆకాంక్షించడం సమంజసమే. కాని అటువంటి ఆనందమయమైన జీవితం గడపడానికి ఏం చేయాలి? ఇది తెలియక మానవ జాతి నిత్యం సమస్యలతో, బాధలతో కొట్టుమిట్టాడు తోంది. ఈ సంక్షోభంనుండి బయట పడేమార్గాన్ని భగవద్గీత ఉపదేశించింది. ఇక్కడ ఒక విషయం గ్రహించాలి. కష్టాలు వేరు. దు:ఖం వేరు. సుఖం వేరు. ఆనందం వేరు. కష్టాలు అందరికీ వస్తాయి. కానీ వాటి విషయంలో ఒక్కొక్కరి స్పందన ఒక్కొక్క విధంగా ఉంటుంది. ఉదాహరణకు పితృవియోగం అందరికీ బాధాకరమే. కానీ తల్లిదండ్రులపై ఆధారపడి జీవించే వారికి, స్వతంత్రంగా వ్యవహా రాలు చక్కబెట్టుకోలేని వారికి పితృవియోగం పెద్ద సమస్యగా పరిణమిస్తుంది. ఇటువంటి పరిస్థితి నుండి బయటపడటానికి సమర్థత పెంచుకోవడం అవసరం.

అనపేక్ష శుచిర్దక్షా ఉదాశీనోగతవ్యధ
సర్వారంభ పరత్యాగీ యోమద్భక్తసమేప్రియ:
(భగవద్గీత12-16)

దేనిపైనా అపేక్ష లేనివాడు, శుచిగా ఉండేవాడు, సమర్థుడైనవాడు, ఉదాశీనంగా ఉండే వాడు, విచారాన్ని విడిచిపెట్టినవాడు సమస్త కార్య ములయందు కర్తృత్వం వదలినవాడయిన భక్తుడు అంటే నాకు ఇష్టుడు. విచారాన్ని విడిచిపెట్టిన భక్తుడు తనకు ఇష్టుడని ఈ శ్లోకంలో స్పష్టంచేశాడు.

అయితే శోకాన్ని విడిచిపెట్టాలంటే ఈ శ్లోకంలో అంతకు ముందు చెప్పిన నాలుగు సుగుణాలను అలవరచుకోవాలి. శుచి, సమర్థత, ఉదాశీనత, నిరపేక్ష అనే సద్గుణాలద్వారా మనిషి దు:ఖాన్ని అధిగమించగలుగుతాడు. ఇక్కడ శుచి అంటే బాహ్యాభ్యంతర శుచి అని అర్థం చెప్పుకోవాలి. విచారాన్ని విడిచిపెట్టడానికి సమమర్థత కూడా ఒక సాధనమని పరమాత్మ తెలిపాడు. అటువంటి సమర్థత కలిగిన భక్తుడంటే ఇష్టమని శ్రీకృష్ణుడు చెప్పినవిషయం నిత్యం గుర్తుంచుకోవాలి. భక్తి మార్గం అసమర్థతను ప్రోత్సహించదు. శోకాన్ని విడిచిపెట్టాలనే బోధ కేవలం అర్జునునికి మాత్రమేకాదు అందరికీ. సకల మానవాళి దు:ఖంనుండి విముక్తి పొందడానికి అనుసరించ వలసిన మార్గాన్ని భగవద్గీత ఉపదేశించింది. ఈ విషయాన్ని అనేక సందర్భాలలో కృష్ణ పరమాత్మ నొక్కి చెప్పాడు. అసలు గీతాబోధ దీనితోనే ఆరంభ మయింది. భగవద్గీతలో ప్రథమాధ్యాయం అర్జున విషాదయోగం. ఈ అధ్యాయంలో కృష్ణ పరమాత్మ మాట్లాడడు. అర్జునుని బాధను వింటాడు. అతని వ్యామోహాన్ని పోగొట్టే బోధను రెండవ అధ్యాయం 11వ శ్లోకంతో ప్రారంభిస్తాడు.

అశోచానన్వశోచత్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే
గతాసూనగతాసూనశ్చ నాను శోచన్తి పండితా:
(2-11)

శోకింపదగని వారిని గూర్చి నీవు విచారిస్తున్నావు. పైగా ప్రజ్ఞావంతుడిలా మాట్లాడు తున్నావు. మరణించిన వారి గురించి కాని జీవించి ఉన్న వారి గురించి కాని పండితులు దు:ఖించరు. విచారించడం పనికి రాదనే హితబోధతోనే గీతో పదేశం ప్రారంభమయింది. అది పండిత లక్షణం కాదని కూడా ఈ శ్లోకం చెబుతోంది. కేవలం కావ్యాలు, నాటకాలు, అలంకారాది శాస్త్రాలు చదివిన వారు మాత్రమే పండితులు కాదని పరమాత్మ ఇక్కడ స్పష్టం చేశాడు. ఆత్మ జ్ఞానం పొందినవారు ఈ రకమైన పండితులు కాగలరని భగవానుని ఉద్దేశం. మరణించిన వారి కోసం ఎందుకు విచారించకూడదో పరమాత్మ తరువాతి శ్లోకాలలో వివరించాడు.

దేహినోస్మిన్ యథాదేహే కౌమారం యౌవనంజరా
తథాదేహాన్తర ప్రాప్తిర్ధీరస్తత్రనముచ్యతే (2–12)

జీవునకు శరీరంలో బాల్యం, యవ్వనం, వార్ధక్యం ఏవిధంగా సంభవిస్తాయో, దేహాంతర ప్రాప్తికూడా అదే విధంగా జరుగుతుంది. కనుక ధీరులు ఈ విషయంలో శోకించరు. ఇదే పూనర్జన్మ సిద్దాంతం. ఈ సిద్ధాంతం మానవులలో మానసిక ధైర్యాన్ని పెంచుతుంది. మరణం శరానికేకాని ఆత్మకు ఉండదని పరమాత్మ స్పష్టం చేశాడు.

అవ్యక్తోయమచింత్యోయం అవికార్యోయముచ్యతే
తస్మాదేవం విదిత్వైనం నానుశోచతి మర్హసి (2–25)

ఆత్మ ఇంద్రియములకు గోచరము కానిది. మనస్సుచేత చింతింపశక్యము కానిది. వికారాలు పొందనిది. ఈ విషయాలు తెలుసుకుంటే నీవు విచారించడానికి అవకాశం ఉండదు.

అథచైనం నిత్యజాతం నిత్యావామన్యసేమృతమ్
తథాపిత్వా మహాబాహో నైవం శోచితుమర్హసి(2.26)

గొప్ప బలపరాక్రమాలు కలిగిన ఓ అర్జునా! శరీరం వలె ఈ ఆత్మకుకూడా పుట్టుక, చావు ఉన్నాయని భావించినా నీవు శోకించవలసిన అవసరం లేదు. ఆత్మకు చావులేదని అంతకు ముందు శ్లోకాలలో పరమాత్మ స్పష్టంచేశాడు. కానీ ఆ విషయం నమ్మలేనివారి కోసం ఈ విషయం చెప్పాడు. మొత్తం మీద సారాంశం ఏమిటంటే ఆత్మకు నాశనం లేదని భావించినా, శరీరంవలె ఆత్మకుకూడా చావుపుట్టుకలు ఉన్నాయని భావించినా విచారించవలసిన అవసరం లేదన్నాడు. ఇది కేవలం అర్జునుడికి మాత్రమే చెప్పిన మాటకాదు. మానవజాతికి అంతటికి చేసిన ఉపదేశం. మరణించిన వారికోసం విచారించడం శుద్ధ అనవసరమని గీతా సారం. ఈ సందర్భంలో 'మహాబాహో' అని అర్జునుని సంబోధించడంలో కూడా ఎంతో అంతరార్థం ఉంది. శారీరకంగా బలం కలిగిన నీవు మానసికంగా దుర్బలుడవు కాకూడదని హెచ్చరించడమే ఈ సంబోధన పరమార్థం. ఏ విధమైన మోహానికి లొంగవద్దని హితవు చెప్పడమే భగవానుని తాత్పర్యం.

జాతస్యహి ధ్రువోమృత్యుర్ధ్రువంజన్మ మృతస్యచ
తస్మాదపరిహార్యార్థేనత్వం శోచితు మర్హసి (2–27)

పుట్టినవానికి చావుతప్పదు. మరణించినవానికి మళ్ళీ జన్మతప్పదు. తప్పని సరయిన వాటి కోసం విచారించడం అనవసరం. గీతా సారం అంతా ఈ శ్లోకంలో ఇమిడి ఉంది. తప్పని సరి సంఘటనలు జీవితంలో అనేకం జరుగుతూంటాయి. అవి మనకు నచ్చనివైనా, నచ్చినవైనా వాటిని మనం నివారించడం అసాధ్యం. అటువంటి వాటికోసం విచారించడం వల్ల ప్రయోజనం లేదు. కనుక చావు పుట్టుకల గురించి విచారించే అర్హత నీకు లేదు. అని అర్జునునితో పాటు లోకానికి బోధించాడు కృష్ణ పరమాత్మ.

## స్త్రీ ఎలా ఉండాలో అనే కాదు. పురుషుడు ఎలా ఉండాలో కూడా ధర్మ శాస్త్రం చెప్పింది..!! కానీ ఎందుచేతో ఈ పద్యం జన బాహుళ్యంలో లేదు

కార్యేషు యోగీ, కరణేషు దక్షః – రూపేచ కృష్ణః క్షమయా తు రామః
భోజ్యేషు తృప్తః సుఖదుఃఖ మిత్రం – షట్కర్మయుక్తః ఖలు ధర్మనాథః (కామందక నీతిశాస్త్రం)

కార్యేషు యోగీ : పనులు చెయ్యడంలో ఒక యోగివలె, ప్రతిఫలాన్ని ఆశించకుండా చెయ్యాలి. కరణేషు దక్షః : కుటుంబాన్ని నడపడంలో, కార్యాలను నిర్వహించడంలో నేర్పుతో, సంయమనంతో వ్యవహరించాలి. సమర్ధుడై ఉండాలి. రూపేచ కృష్ణః : రూపంలో కృష్ణునివలె ఉండాలి. అంటే (ఎనిమిది పెళ్ళిళ్ళు చేసుకోమని కాదు) ఎల్లప్పుడూ ఉత్సాహంగా, సంతోషంగా ఉండాలి. క్షమయా తు రామః : ఓర్పులో రామునిలాగా ఉండాలి. పితృవాక్యపరిపాలకుడైన రాముని వలె క్షమించేగుణాన్ని కలిగిఉండాలి. భోజ్యేషు తృప్తః : భార్య / తల్లి వండినదాన్ని సంతృప్తిగా (వంకలు పెట్టకుండా) భుజించాలి.

# అద్భుతమైన వరం.. బ్రహ్మముహూర్తం..!!

పూర్వం కాలాన్ని ఘడియలలో లెక్కించేవారు. ఒక ఘడియకు మన ప్రస్తుత కాలమాన ప్రకారంగా 24 నిమిషాలు. ఒక ముహూర్తం అనగా 2 ఘడియల కాలం అని అర్థం. అంటే 48 నిమిషాలను ఒక ముహూర్తం అంటారు. ఒక పగలు, ఒక రాత్రినీ కలిపిన మొత్తాన్ని అహోరాత్రం అంటారు. ఒక అహోరాత్రంకు ఇలాంటివి 30 ముహూర్తాలు ఉంటాయి. అంటే, ఒక రోజులో 30 ముహూర్తాలు జరుగుతాయి. సూర్యోదయమునకు ముందు వచ్చే ముహూర్తాలలో మొదటిది. దీనినే 'బ్రహ్మముహూర్తం' అంటారు. అంటే రోజు మొత్తంలో 29వది బ్రహ్మ ముహూర్తం.

ఈ ముహూర్తానికి అధిదేవత బ్రహ్మ. కాబట్టి దీనికి బ్రహ్మ ముహూర్తం అనే పేరు వచ్చింది. నిజానికి తెల్లవారుజామును 2 భాగాలుగా విభజించారు. సూర్యోదయమునకు 2 ఘడియల ముందు కాలాన్ని అనగా 48 నిమిషముల ముందు కాలాన్ని ఆసురీ ముహూర్తం అని ఆసురీ ముహుర్తానికి ముందు 48 నిమిషముల ముందు కాలాన్ని బ్రహ్మముహూర్తం అని అంటారు.

ప్రతిరోజు బ్రహ్మముహుర్తమున లేచి భగవంతుని ధ్యానించి పనులు ప్రారంభించాలని అంటారు. బ్రహ్మమూహూర్తానికి ఉన్న అత్యధిక ప్రాధాన్యత దృష్ట్యా అనేక మంది నూతన గృహప్రవేశానికి ఈ సమయాన్ని ఎన్నుకుంటారు. ఈ సమయంలోనే మానవుని మేథాశక్తికి భగవంతుని శక్తి తోడవుతుంది.

**పురాణగాథ –**

బ్రహ్మముహూర్తం అనే పేరు ఎలా వచ్చిందనే విషయంపై పురాణగాథలు ఉన్నాయి. కశ్యప బ్రహ్మకు, వినతకు జన్మించిన వాడు అనూరుడు. గరుత్మంతునికి సోదరుడు. ఇంకా అనూరుడు సూర్యునికి రథసారథి. ఒక సమయంలో తల్లి వినత పుత్రుడిని చూసుకోవాలని కుతూహలంతో అండం పగలగొట్టింది. అప్పుడు సగం శరీరంతో అనూరుడు జన్మించాడు.

బ్రహ్మ అతన్ని సూర్యునికి సారథిగా నియమించి, నీవు భూలోకాన మొదటగా కనిపించిన కాలమునే బ్రహ్మముహూర్త కాలమంటారు. ఆ సమయమున ఏ నక్షత్రాలు, గ్రహాలుగాని చెడు చేయలేవు అని అనూరునికి వరమిచ్చాడు. అందుకే బ్రహ్మముహూర్త కాలం అన్ని శుభ కార్యాలకు ఉన్నతమైందని శాస్త్రం చెబుతోంది.

ఈ బ్రహ్మ ముహూర్తకాలమున చదివే చదువు.. చేసే శుభకార్యాలు దిగ్విజయంగా పూర్తవుతాయని చెప్పవచ్చు.

ఏం చేయాలి..?

ఉదయం 3 గంటల నుంచి 6 గంటల వరకు ఉండే సమయం బ్రహ్మముహూర్తం. ఆధ్యాత్మిక చింతన చేసేవారికి, విద్యార్థులకు, ధ్యానం, జప తపాదులు చేయువారికి చాలా విలువైన సమయం. ఆ సమయంలో మనసు ప్రశాంతంగా ఉండి స్వచ్ఛంగా ఉంటుంది. సాత్వికమైన వాతావరణం కూడా గోచరిస్తుంటుంది. మనసు స్వచ్ఛంగా తెల్లకాగితంలా దైనందిన జీవితంలో ఉండే గజిబిజి ఏమీ లేకుండా ప్రశాంతంగా ఉంటుంది. ఎలాంటి రాగ ద్వేషాలు, ఇష్టాయిష్టాలు లేని సమయం.

ఈ సమయంలో మన మనసు ఎలా కావాలంటే అటు తేలికగా మారుతుంది. ఆధ్యాత్మిక ఆనందాన్ని చాలా సులువుగా పొందవచ్చు. అందుకే ఆ సమయంలో యోగులు, పరమహంసలు, సన్యాసులు, ఋషులు హిమాలయాలలో ధ్యానంలో ఉంటూ వారి వారి తపఃశక్తి తరంగాలను ప్రపంచ మంతా ప్రసరింపచేస్తారు.

అందువలన ఆ సమయంలో చేసే ధ్యానం మనకు ఆధ్యాత్మికంగా సిద్ధిస్తుంది. అయితే చాలా మంది ఆ సమయంలో నిద్రతో సమయాన్ని వృధా చేస్తూ ఆధ్యాత్మిక తరంగాలని నష్టపోతుంటారు. ఎలాంటి పూజలు, ధ్యానాలు, సాధనలు లేకపోయినా కనీసం మేలుకొని ఉండమంటారు మన పెద్దవాళ్లు.

చల్లని నీటితో తలస్నానం చాలా మంచిది. దీంతో మెదడు, కళ్లు చల్లగా ఉంటాయి. బ్రహ్మ ముహూర్తంలో ధ్యానం, జపం, ప్రాణాయామం, ఆసనాలు, కీర్తనలు, స్తోత్రాలు సాధన చేయటం చాలా మంచిది. బ్రహ్మముహూర్తం చాలా విలువైన కాలం. ఈ సమయాన్ని వృధా చేయకూడదు. పూజలకు, యోగాకు, ప్రాణాయామానికి ఉపయోగించుకోవాలి.

పద్మాసనంలో గానీ, సుఖాసనంలో గానీ కూర్చుని చేసే ధ్యానానికి ఆ సమయంలో మనోశక్తి లభిస్తుంది. మొదలుపెట్టే ముందు 12 సార్లు ఓంకారం, 5 నిముషాలు ఏదైన కీర్తన పాడటం వలన మనసు త్వరగా భగవధ్యానంలో ఏకాగ్రతను కుదుర్చుకుంటుంది.

బ్రహ్మముహూర్తంలో చేసిన ఓంకార ధ్వని వలన సుషుమ్న నాడి తెరుచుకుంటుంది. అందుకే ఋషులు, యోగులు, ఈ సమయంలో బిగ్గరగా ఓంకారం జపిస్తారు. ఎప్పుడైతే మన నాసిక రంధ్రాల లోకి శ్వాస ప్రవహిస్తూ ఉంటుందో వెంటనే సుషుమ్న నాడి పని చేయడం మొదలుపెడుతుంది. అప్పుడే ధ్యానం బాగా కుదురుతుంది. ముందు మనం మన అంతర్యామిలోని ఆత్మలో లీనమై తద్వారా పరమాత్మను చేరుకుంటాము...

# సూర్యాష్టకం

- భోగయగారి చన్ద్రశేఖర శర్మ, 9440044142

ప్రణతులనందుకొనుము ఆదిదేవుడా!
భాస్కరా! నన్ను దయజూడు ప్రణుతి జేతు
సూర్యనారాయణా! నీకు జోతలివియె
ఏడు గుఱ్ఱాల రథమెక్కి యేగుదెంచు
అతుల తేజస్వి! శ్రీ కశ్యపాత్మజుండ!
శ్వేత పద్మమ్ము చేబట్టు వెలుగు ఱేడ!
సూర్యనారాయణా! నీకు జోతలివియె
లోహ రథమెక్కి చరియించు లోకపూజ్య!
సకల లోకపితామహా! చండ తేజ!
పాప హారకా! ఘన తామసాపహారి!
సూర్యనారాయణా! నీకు జోతలివియె
త్రిగుణ వశవర్తి! శూరుడా! శ్రీకరుండ!
బ్రహ్మవు, గిరిశుడవు చక్రపాణి వీవె
పాప సంహర్తవీవయ్య భక్తపాల!
సూర్యనారాయణా! నీకు జోతలివియె
విస్తృతము జేసి తేజస్సు, విశ్వమందు
గాలి,యాకాశములలోన కలియజేయు
సర్వలోక ప్రభువు నీవు జయము నీకు
సూర్యనారాయణా! నీకు జోతలివియె
తనువు మందార సుమరుచిన్ తనరుచుండ
హార,కుండలధరుడవు వీర! మిత్ర!
ఏక చక్ర రథ విహారి! శోక నాశ!
సూర్యనారాయణా! నీకు జోతలివియె
ఘనుడవీవట లోకాల కర్తవీవె
గొప్ప వెలుగుల కిరణాల కుప్పవీవు
ఘోర పాపాపహారి! తుషార హారి
సూర్యనారాయణా! నీకు జోతలివియె
విష్ణుదేవుడవీవేను విమలరూప!
జగతి నాథుడ! జ్ఞాన విజ్ఞానదుడవు
మోక్షదాతవు వరదాన దక్షుడీవె
సూర్యనారాయణా! నీకు జోతలివియె
సూర్యనారాయణాష్టక శ్రోతకెపుడు,
పఠితకైనను గ్రహముల బాధలణగి,
ఆయురారోగ్య సంపదలబ్బుననుచు
చంద్రశేఖరుడినునిట్లు స్తవము జేసె
శ్రీరస్తు శుభమస్తు ఆరోగ్యమస్తు

# శాలిభద్ర

ఒకప్పుడు, ఒక చిన్న గ్రామంలో ఒక పేద తల్లి మరియు ఆమె కొడుకు ఉండేవారు. ఒకరోజు ఆ ఊరిలో పండగ జరిగి ఆ పేద కొడుకుతో సహా పిల్లలందరూ ఆడుకోవడానికి గుమిగూడారు. ఆడు కున్న తర్వాత అందరూ తమ వెంట తెచ్చుకున్న ఖీర్ (తీపి అన్నం పాయసం మరియు పాలు) తినడం ప్రారంభించారు. ఈ పేద కుర్రాడి దగ్గర ఏమీ లేదు. అతను బాధపడ్డాడు మరియు తన తల్లి వద్దకు తిరిగి పరుగెత్తాడు. పిల్లలందరూ తింటున్నారు కాబట్టి తన్ని ఖీర్ చేస్తావా అని అడిగాడు. అతని తల్లి ఖీర్ చేయ లేనని, తాను వండినది తినమని చెప్పింది. అతను ఏడవడం ప్రారంభించాడు మరియు ఖీర్ కోసం పట్టుబట్టాడు. అతని ఏడుపు చూడడానికి అతని తల్లి ఇష్టపడలేదు. దాంతో ఆమె పొరుగింటికి వెళ్లి తన కొడుక్కి ఖీర్ చేయడానికి పాలు, పంచదార, బియ్యం అప్పుగా తీసుకుంది. ఆమె ఖీర్‌ను ఒక గిన్నెలో పోసి, బావినుండి నీరు తీసుకురావడానికి బయలుదేరింది. బాలుడు తినడం ప్రారంభించబోతున్నప్పుడు, “ధర్మ లాభ్” (అంటే, మీరు ఆధ్యాత్మికతతో ఆశీర్వదించ బడండి, సాధారణంగా ఒక జైన సాధువు మాట్లాడ తారు) అనే పదాలు విన్నాడు. అతను భిక్ష (ఆహారం) కోసం తలుపు వద్ద ఒక సన్యాసిని చూశాడు. ఆకలితో ఉన్న బాలుడు ఎటువంటి సందేహం లేకుండా సన్యా సిని లోపలికి ఆహ్వానించి అతనికి ఖీర్ అందించాడు. ఖీర్ పోసేటప్పుడు అదంతా సన్యాసి కుండలోకి జారి పోయింది. తినడానికి ఏమీ మిగలకపోయినా సన్యా సికి దీన్ని సమర్పించగలిగానని అతను సంతోషిం చాడు. అతని సదుద్దేశం అతనికి మంచి కర్మలను తెచ్చిపెట్టింది, మరియు అతని తదుపరి జన్మలో, అతను ప్రసిద్ధ శాలిభద్రుడిగా జన్మించాడు.

శాలిభద్ర తల్లి భద్ర శేథని మరియు అతని తండ్రి గోభద్ర షేట్. బాలుడు చిన్నతనంలో అతని తండ్రి ఇల్లు వదిలి సన్యాసి అయ్యాడు. శాలిభద్రుడు పుట్టుకతో కోటీశ్వరుడు. అతని జీవితం స్వర్గంలో ఉన్నట్లుగా ఉంది. అతని విలాసవంతమైన జీవన శైలికి స్వర్గపు దేవదూతలు కూడా అసూయపడ్డారని చెప్పబడింది. అతనికి 32 మంది అందమైన భార్యలు ఉన్నారు. అతను తన తండ్రిలాగే సన్యాసి అవుతాడనే భయంతో అతని తల్లి అతనిని తన రాజభవనం నుండి బయటకు పంపలేదు.

ఒకరోజు, నేపాల్‌నుండి కొంతమంది వ్యాపా రులు చాలా ఖరీదైన చీరలను అమ్మడానికి వచ్చారు. వారు రాజు శ్రెనిక్ కోర్టుకు వెళ్లారు, అక్కడ రాజు తన పౌరుల డబ్బును ఇంత ఖరీదైన చీరల కోసం ఉపయోగించలేనని చెప్పాడు. ఈ నగరంపై ఎన్నో ఆశలు పెట్టుకున్న వారు నిరాశతో వెనుదిరిగారు. ఈ విషయం తెలుసుకున్న భద్రా శేతాని ఆ వ్యాపా రులను పిలిపించింది. రాజు కొనుగోలు చేయలేక పోతే, ఏ నివాసి అంత ఖరీదైన వస్తువును ఎలా కొనుగోలు చేయగలడు కాబట్టి వ్యాపారులు వెళ్ళ డానికి ఇష్టపడరు. కానీ వారు ఎలాగూ అక్కడికి వెళ్లారు. భద్ర శేతాని “నీ దగ్గర ఏమి ఉంది?” తమ వద్ద పదహారు చీరలు ఉన్నాయని చెప్పారు. ఆమె, “పదహారు మాత్రమేనా? నాకు ముప్పై ఇద్దరు కోడలు ఉన్నారు కాబట్టి నాకు ముప్పై రెండు చీరలు కావాలి.” వ్యాపారులు ఆమె తమాషా చేస్తోందని, ఒక్కటి కూడా కొనదని భావించారు. ఆమె, “మీరు దేని కోసం ఎదురు చూస్తున్నారు. ఆచీరలు తీయండి.” వాళ్ళు ఆపదహారు చీరలు తీశారు. మరో ఆలోచన లేకుండా ఆమె మొత్తం పదహారు చీరలను కొనుగోలు చేయ డంతో వ్యాపారులు ఆశ్చర్యపోయారు. అంత విలువైన చీరలను తమ ముందు రెండు ముక్కలుగా చింపి, ఒక్కొక్క కోడలికి పాదాలు తుడుచుకోవడానికి ఒక ముక్క ఇవ్వడం చూసి వారు మరింత మురిసి

పోయారు. వ్యాపారులు దిగ్భ్రాంతి చెందినా ఆనందం తో వెళ్లిపోయారు. కోడళ్ళు ఈ ముక్కలను ఒక్కసారి వాడి పారేసారు.

సేవకులలో ఒకరు రాణిని ఇష్టపడ్డారు, కాబట్టి ఆమె రాణికోసం ఒక ముక్క తీసుకుంది. రాణి అయోమయంలో పడింది కానీ తన రాజ్యంలో ఇంత ధనవంతులు నివసిస్తున్నందుకు సంతోషిం చింది. ఈ విషయాన్ని ఆమె రాజు శ్రేనిక్‌కి చెప్పింది. తన రాజ్యం యొక్క మంచి పేరును నిలబెట్టే అటు వంటి ధనవంతుల గురించి అతను చాలా గర్వంగా భావించాడు. అతను శాలిభద్రుడిని గౌరవించటానికి తన ఆస్థానానికి ఆహ్వానించాడు. భద్ర శేతనికి తెలియగానే, ఆమె రాజు వద్దకు వెళ్లి, తన కొడుకు చాలా సిగ్గుపడుతున్నాడని చెప్పి, శాలిభద్రుడిని గౌరవించటానికి రాజును తన రాజభవనానికి రమ్మని ఆహ్వానించింది. రాజు శ్రేనిక్ ఆహ్వానాన్ని అంగీకరించి శాలిభద్రుని రాజభవనానికి వెళ్ళాడు. రాజు శ్రేనిక్ అక్కడికి చేరుకున్నప్పుడు, శాలిభద్రుడి రాజభవనంతో పోలిస్తే తన రాజభవనం ఏమీ లేదని గ్రహించాడు. భద్ర శేతాని అతనికి కూర్చోవడానికి స్థలం ఇచ్చింది మరియు రాజును చూడటానికి శాలిభద్రుడిని క్రిందికి రమ్మని కోరింది. శాలిభద్రకు రాజు గురించి లేదా రాజ్యం గురించి ఏమీ తెలియదు మరియు అతని తల్లి తనకు చూపించాలనుకునే సరుకు ఏదో ఉందని భావించాడు. అందుకని, "నాకు అది చూడాలని లేదు, కానీ కొనండి" అన్నాడు. అతని తల్లి, "ఇది సరుకు కాదు. అతను మా రాజు, మా యజమాని, మరియు మీరు అతనిని అభినందించడానికి మరియు గౌరవిం చటానికి క్రిందికి రావాలి." యజమాని అనే పదం చెవిలో మ్రోగడం మొదలైంది. అతను ఆశ్చర్య పోయాడు, "నాపై నాకు యజమాని ఎందుకు ఉండాలి. నాకు నేనే యజమానిగా ఉండాలి." ఇలా ఆలోచిస్తూ ఉండగానే దిగి వచ్చి రాజుగారికి నివాళు లు అర్పించినా ఎక్కువ సేపు ఉండలేక వెనుదిరిగాడు.

పైగా తనకెవరో ఉన్నందున తనకు తీరిక లేదని అనుకుంటూనే ఉన్నాడు. అతను తన తండ్రి (సన్యాసిగా మారిన) మరియు జీవితానికి నిజమైన అర్థం గురించి ఆలోచించడం ప్రారంభించాడు. అతను సన్యాసి కావాలని ఆ క్షణంలో నిర్ణయించు కున్నాడు మరియు తన నిర్ణయాన్ని తన కుటుంబ సభ్యులకు చెప్పాడు. అతని తల్లి మరియు భార్యలు అతనితో మరికొంత సమయం గడపమని అతనిని ఒప్పించేందుకు ప్రయత్నించారు మరియు బహుశా దాని గురించి ఆలోచించవచ్చు. కానీ అతను వినలేదు. చివరకు, అతను ఒకేసారి ముప్పై రెండు మంది భార్యలను విడిచిపెట్టకుండా, ఒకేసారి ఒక భార్యను విడిచిపెడతానని, ఆపై అతను ఖచ్చితంగా సన్యాసి అవుతానని అంగీకరించాడు. అతను అదే రోజు చేయడం ప్రారంభించాడు.

కొన్ని రోజులు గడిచిపోయాయి. ఒకరోజు అతని సోదరి సుభద్ర తన భర్తకు ధన్నకు స్నానం చేయిస్తుండగా అకస్మాత్తుగా ఆమె కళ్లలోనుండి నీళ్ళు జారి అతని మీద పడ్డాయి. అతను పైకి చూసాడు మరియు అతని ప్రేమగల భార్య ఏడుస్తూ కనిపించింది. ఏం జరిగిందని ఆమెను అడిగాడు. తన సోదరుడు సన్యాసి కావాలని నిర్ణయించుకున్నా డని మరియు అతను ప్రతిరోజూ ఒక భార్యను విడిచిపెడుతున్నాడని ఆమె అతనికి చెప్పింది. ధన్నా నవ్వుతూ సుభద్రతో, "ఆమె అన్న పిరికివాడు. అతను తన భార్యలను విడిచిపెట్టాలనుకుంటే, ఎందుకు వేచి ఉండాలా?" అది విని సుభద్ర కలత చెంది, "చేయడం కంటే చెప్పడం తేలిక" అని భర్తతో చెప్పింది. ఇది ధన్నా యొక్క మనస్సులో ఒక అవగాహనను రేకెత్తిం చింది మరియు అతను ఆమెతో, "నేను మీ ఎనిమిది మందిని ఇప్పుడే వదిలివేస్తున్నాను మరియు నేను సన్యాసిని కావడానికి ఇప్పుడే బయలుదేరుతున్నాను" అని చెప్పాడు. సుభద్రకు ఆశ్చర్యం వేసింది. తప్పక హాస్యమాడుతున్నాడని ఆమె అతనికి చెప్పింది. కానీ

ధన్నా, "ఇప్పుడు చాలా ఆలస్యమైంది. నేను సన్యాసిని కావాలని నిశ్చయించుకున్నాను. మీరందరూ నాతో చేరాలనుకుంటే మీకు స్వాగతం." ధన్నా నిశ్చయించుకోవడం చూసి, సుభద్ర మరియు అతని మిగిలిన ఏడుగురు భార్యలు కూడా సన్యాసినులు కావాలని నిర్ణయించుకున్నారు. ఇప్పుడు, ధన్న తన బావమరిది శాలిభద్రుడి దగ్గరకు వచ్చి, "ఏయ్ పిరికివాడా! మీరు నిజంగా కుటుంబాన్ని విడిచిపెట్టి సన్యాసిగా మారాలనుకుంటే, మీరు దేని కోసం ఎదురు చూస్తున్నారు? నాతో కలువు."

శాలిభద్రుడు సవాలు విని స్వీకరించాడు. అతను తన భార్యలతో, "క్షమించండి, అయితే నేను ఈ రోజు మీ అందరినీ విడిచిపెడుతున్నాను." అతను తన బావగారితో చేరడానికి దిగాడు. అతని భార్యలు కూడా అతనితో జతకట్టారు. వారంతా మహావీరుడి వద్దకు వెళ్లి దీక్ష చేపట్టారు.

ఇంత విలాసవంతమైన జీవితానికి ఎంత అపురూపమైన ముగింపు! సన్యాసిగా తపస్సు చేసిన తరువాత, అతను స్వార్థసిద్ధ విమానంలో దేవదూతగా జన్మించాడు. అక్కడ నుండి, అతను మహావిదే క్షేత్రంలో జన్మించాడు మరియు చివరికి మోక్షాన్ని, మోక్షాన్ని పొందుతాడు.

## రౌస్ పీటర్

రౌస్ పీటర్ అనే బ్రిటిష్ కలెక్టర్ 1812 నుండి 1828 వరకు మధురై కలెక్టర్‌గా నియమితులయ్యారు. విశ్వాసం ద్వారా క్రైస్తవుడైనప్పటికీ, అతను హిందూమతంతో సహా అన్ని విశ్వాసాలను గౌరవించాడు, స్థానిక పద్ధతులను కూడా గౌరవించాడు.

కలెక్టర్ పీటర్ మీనాక్షి అమ్మన్ ఆలయానికి ఆలయ నిర్వాహకుడిగా ఉంటూ తన విధులన్నింటినీ చిత్తశుద్ధితో, నిజాయితీతో నిర్వహించి ప్రజలందరి మతపరమైన మనోభావాలను గౌరవించేవాడు.

కలెక్టర్ రౌస్ పీటర్ అన్ని మతాల ప్రజలను సమానంగా గౌరవిస్తారు మరియు చూసేవారు. ఈ గొప్ప లక్షణం అతనికి 'పీటర్ పాండియన్' అనే ప్రసిద్ధ మారుపేరును సంపాదించి పెట్టింది.

దేవత మీనాక్షి అమ్మన్ ఆలయం కలెక్టర్ పీటర్‌నివాసం మరియు కార్యాలయం మధ్య ఉంది. రోజూ గుర్రంపై ఆఫీసుకు వెళ్లి గుడి దాటుతుండగా గుర్రం దిగి టోపీ, బూట్లు తీసేసి కాలినడకన దారి మొత్తం దాటేవాడు. ఈ చిన్న సంజ్ఞ ద్వారా దేవతకు తన భక్తిని చాటుకున్నాడు!

ఒకరోజు మదురై నగరంలో భారీ వర్షం కురిసి, వైగై నది ఉప్పొంగింది. కలెక్టర్ తన నివాసంలో నిద్రిస్తుండగా, అకస్మాత్తుగా పాదరక్షల శబ్దంతో నిద్రలేచి, ఆ శబ్దం ఎక్కడనుండి వచ్చిందో తెలుసుకోవడానికి బయటికి వచ్చాడు. పట్టు వస్త్రాలు, విలువైన ఆభరణాలు ధరించి, పీటరు ఇటువైపు రా' అని సంబోధిస్తూ ఒక చిన్న అమ్మాయిని చూశాడు.

అతను ఆమెను అనుసరించడానికి బయటికి వచ్చాడు. ఆమెవరో తెలుసుకోడానికి చిన్న అమ్మాయి వెనుక నడుస్తున్నాడు! అతను ఇంటి నుండి బయటకు వచ్చి పరుగెత్తుకుంటూ ఉండగా, అతను తన వెనుక వైపు తిరిగి చూడగా, అతని నివాసం వైగై నది వరద నీటిలో కొట్టుకు పోవడం చూసి ఆశ్చర్యపోయాడు!

అతను ఆ అమ్మాయిని అనుసరించడానికి తిరిగాడు, ఆమె గాలిలో అదృశ్యమైంది! అమ్మాయి పాదరక్షలు లేకుండా పరుగెత్తడం, చీలమండలు ధరించడం చూశాడు. తల్లి మీనాక్షి దేవతపట్ల తన కున్న భక్తి తన ప్రాణాలను కాపాడిందని నమ్మాడు.

తరువాత, అతను మీనాక్షి అమ్మన్‌కు బహుమతి ఇవ్వాలని కోరుకున్నాడు మరియు ఆలయ పూజారిని సంప్రదించి, దేవత మీనాక్షి అమ్మన్ కోసం ఒక జత 412 కెంపులు, 72 పచ్చలు బంగారు బూట్లు (పాదుకము)ల జతను సమర్పించాడు.

# పాత తెలుగు సాహిత్యం ఎందుకు చదవాలి?

- పరుచూరి శ్రీనివాస్

మూడు సంవత్సరాల క్రితం ఇండియా వెళ్తుంటే స్నేహితులొకరు "ఆముక్తమాల్యద" టీకాతాత్పర్య సహితంగా దొరికితే కొనిపెట్టమన్నారు. ఏ పుస్తకాల కొట్లో అడిగినా దొరకలేదు. ఈ మధ్య మరొకరు ఇరవయ్యో శతాబ్దపు ముందు నాటి సాహిత్యం ఏది దొరికినా తీసుకోమన్నారు. చెప్తే నమ్మరు కాని, గుంటూరు లాంటి పెద్ద పట్టణంలో కూడా, ఒక్క కావ్యమంటే ఒక్కటి కూడా దొరకలేదు. ఒక ప్రముఖ ప్రచురణకర్తతో అదే మాటంటే "అడిగేవారూ లేరు, చదివే వారూ లేరూ" అన్నారు. పాత సాహిత్యం అంటే ఆసక్తి ఎందుకు తగ్గిపోతుంది, దాన్ని మళ్ళీ పెంచడానికి మనం ఏం చేయాలి, పెద్దనని, శ్రీనాథుణ్ణి పక్కన పెట్టి షేక్స్పియర్‌ని, మిల్టన్‌ని ఎందుకు చదువుతాం, మొదలైన ప్రశ్నలకు నా దగ్గర సమాధానాలు లేవు కాని, నేనెందుకు చదువుతానో మాత్రం చెప్పదలచుకున్నాను. నాకు చరిత్రంటే ఆసక్తి. తెలుగు సమాజపు సాంఘిక స్థితిగతులు గడచిన వేయి సంవత్సరాలలో ఏవిధంగా మారుతూ వచ్చాయో అర్థం చేసుకోవాలన్నది నా ప్రయత్నం. (అంతో ఇంతో తెలుగుసాహిత్యం అంటే అభిమానం ఉందనుకోండి.) "ఆముక్త మాల్యద" పేరెత్తాను కాబట్టి ఆ పుస్తకం గురించి ముందుగా మాట్లాడుకుందాం. దాన్ని ప్రబంధయుగంలో కృష్ణదేవ రాయలు రాశాడని మనందరికీ తెలుసు. అది వైష్ణవ సంప్రదాయం నుండి మనకు పరిచితమైన "గోదాదేవి కథ" అని అందరం అనుకుంటాం. (అవునో కాదో తెలుసుకోవాలంటే ఆ పుస్తకం చదవండి మరి) అందులో గోదాదేవి కథ కంటే రాజనీతి పాఠాలు ఎక్కువని కొందరు అభిప్రాయపడ్డారు. ఇలా భక్తి కావ్య మనో, లేకుంటే రాజనీతి పాఠాలు చెప్పే పుస్తక మనో దాన్ని పట్టించుకోని వాళ్ళే ఎక్కువ. దానిలోని కవితా విలువల్ని పట్టించుకున్న వాళ్ళు కూడా చారిత్రక విలువల్ని గుర్తించలేకపోయారు. పోతే, ఆ పుస్తకం "పూర్తిగా" చదివి వుంటేనో, లేకుంటే చదివిన మన వాళ్ళు ఆంగ్లంలోకి అనువదించి పెడితేనో విజయ నగర చరిత్ర కొంతైనా వేరుగా రాయబడి వుండేదని నా నమ్మకం.

కవితా పరంగా దానిలోని ఋతువర్ణనలూ, దైనందిన జీవితంలోని సంఘటనల వర్ణనలూ చూడండి. అసలు ఆయన వాడిన భాష అంతకు ముందు ఎవ్వరూ వాడలేదు. భాషకీ, సాహిత్యానికీ, సంస్కృతికీ విడదీయరాని సంబంధం వుంటుందని మనకందరికీ తెలిసిన విషయమే. "ఆముక్తమాల్యద"లో కూడా ఈ సంబంధాన్ని చక్కగా చూడవచ్చు. రాజు మారుతున్నాడు, ఒక కొత్త రాజ్యం నిర్మించబడుతుంది అక్కడ. అలాగే రాజ్యసిద్ధాంతం కూడా మారుతుంది. ఒక కొత్త రాచరికపు వ్యవస్థని రాయలు అక్కడ ప్రతిపాదిస్తున్నాడు.

"ఆముక్త మాల్యద" విషయం అలా వుంటే, మరో ప్రక్క "క్రీడాభిరామం", "హంసవింశతి", "శుకసప్తతి" లాంటి కావ్యాల్లో నాటి సాంఘిక చరిత్రకు సంబంధించిన ఎన్నో విలువైన విషయాలున్నాయని గుర్తించినవారు కూడా వాటిలోని కవితా విలువల్ని పట్టించుకోలేదు.(మొదటి రెండు పుస్తకాలు ఇరవయ్యో శతాబ్దపు మొదటి భాగంలో అశ్లీల సాహిత్యంగా పరిగణింపబడి బహిష్కరింపబడ్డాయన్న విషయం గుర్తించతగ్గది)

"ఈ కాలంలో టీకా, టిప్పణీలు లేకుండా పద్యకావ్యాలను చదవడం కష్టం. అసలు మొన్నటి దాకా తెలుగులో వచనం లేదుగా" అనే చాలామందిని నేనెరుగుదును. (వీళ్ళు పల్లెటూళ్ళలో కరణాలు వంద లేళ్ళుగా తమ రికార్డులు ఎలా రాశారని అనుకుంటారో మరి!) పదహారో శతాబ్దపు చివరి భాగం నుండే తెలుగులో వచనం రాయబడేదనీ (చూ : "ప్రతాపరుద్ర

చరిత్రము" ఏకామ్రనాథుడు) పదిహేడో శతాబ్దినుంచి అది విస్తృతంగానే వాడబడిందని ఎందరు గమనించారు! తెలుగుకి అంతో ఇంతో సేవ చేసిన సి. పి. బ్రౌన్, ఈ దేశం విడిచే ముందు కొన్ని వేల తాళపత్ర గ్రంథాల్ని, రాతప్రతుల్ని ఈరోజు Tamilnadu Archives GOML (Govt. Oriental Manuscripts Library, చెన్నై) అని పిలువబడుతున్నచోట భద్రపరచి వెళ్ళాడని, ఆ సేకరణలో చరిత్రనుండి (ఉదా: హైదరు చరిత్ర) వేదాంతం (ఉదా : తారక బ్రహ్మరాజీయము) వరకు అనేక అంశాలపై గద్యరచనలే ఉన్నాయని మనవాళ్ళు గమనించలేదంటే నమ్మశక్యంగా లేదు. అలాగే మెకన్జీ సేకరించిన కైఫీయత్తులనూ, బంగోరె ఎంతో కష్టనష్టాలకోర్చి లండన్‌నుండి తిరుపతికి చేర్చిన బ్రౌన్ రాతప్రతుల్ని కూడా! వీటి వివరాలన్నీ చాలా యేళ్ళుగా కేటలాగుల రూపంలో అందుబాటులో ఉన్నాయన్నది ఇక్కడ గమనార్హం. "దక్కను చరిత్ర", "దక్షిణ భారత చరిత్ర" అన్న టైటిల్స్ పెట్టుకుని మహారాష్ట్ర, తమిళనాడుల చరిత్రలకే పరిమితమై పోతారని గోలపెట్టే తెలుగువాళ్ళని చూశాను. ఆ చరిత్రకారులకి తెలుగు రాకపోవడమే మన పాపం. మరి మనం అనువాదాలు అందించ వచ్చుగదా అన్న ఆలోచన మన వాళ్ళకెవరికీ వచ్చినట్లు లేదు. వాళ్ళను వదిలేద్దాం. మరి తెలుగు వచ్చినవారు కూడా అరబ్, ఫ్రెంచ్, పోర్చుగీసు, ఇంగ్లీషు పర్యాటకులు : Barbosa, Al Biruni, Bussy, Tavernier, Thevenot, S. Master, రాసిన రాతల మీదే ఎందుకు ఎక్కువగా ఆధారపడతారో కూడా నాకు బోధపడని విషయం. పదేళ్ళక్రితం ఒక అమెరికన్ ప్రొఫెసరు గారు "రాయ వాచకాన్ని" ఆంగ్లంలోకి అనువదించారు. విజయ నగర చరిత్రపై పనిచేసే చరిత్రకారులందరూ "ఇంత విలువైన పుస్తకం తెలుగులో ఉందన్న సంగతి మాకు తెలియదే" అని విస్తుపోయారు. ఆయనే క్రొత్తగా "నౌకా వాణిజ్యం" పై రాస్తూ, శ్రీనాథుడు తన "హర విలాసం" కృతిభర్త అయిన త్రిపురాంతకసెట్టిని స్తుతించే పద్యాల్లోనుంచి ఆనాటి వాణిజ్యానికి సంబంధించిన కొంత విషయ సంగ్రహణ చేశారు. మరో అమెరికన్ ప్రొఫెసరుగారు"ప్రతాపరుద్రచరిత్రా"న్ని తమ కాకతీయ చరిత్ర పుస్తక రచనలో ఎంతో సమర్ధవంతంగా వాడుకొన్నారు. వెల్చేరు నారాయణరావు, సంజయ్ సుబ్రహ్మణ్యం, డేవిడ్ షూల్మాన్ గార్లు తంజావూరు, మదురై సంస్థానాలలో వెలువడిన సాహిత్యాన్ని (అహల్యా సంక్రందనము, విజయవిలాసము, రాధికా సాంత్వనము, సారంగధరచరిత్ర మొ.) విశ్లేషిస్తూ 16,17 శతాబ్దాల నాయక రాజుల చరిత్రను అత్యద్భుతంగా పునర్నిర్మించిన పద్ధతి మనందరికీ తెలుసు. (Symbols of Substance - Court and State in Nayaka Period Tamilnadu, Oxford University Press, 1992,1999) మరి తెలుగుదేశంలో వుంటున్న వాళ్ళెవ్వరూ ఇలాంటి తరహాలో పరిశోధనలు చేస్తున్నట్లుగా నాకు కనబడడం లేదు. ఇప్పటికీ చాలామందికి "చరిత్ర" రచనంటే శిలా శాసనాలనూ, రాగి రేకులనూ, నాణాలనూ, విదేశీ పర్యాటకుల వర్ణనలనూ శోధించడం అనే అభిప్రాయంవుంది. ఆ శాసనాలలో ముఖ్యమైనవి చాలావరకు సాహిత్య రచనలలాగే చేయబడ్డాయన్న విషయాన్ని మనవాళ్ళు విస్మరించడం గమనించండి. ఇంక మనకున్న పురాణాలు, కావ్యాలు, ఇతిహాసాలు అద్భుత వర్ణనలుగానూ, అభూత కల్పనలుగానూ అధికుల చేత కొట్టివేయబడ్డాయి. లేదా దైవీకరించబడి అన్ని రకాలైన పరిశోధనలకూ దూరం చేయబడ్డాయి. అలా వాటిని తోసి పుచ్చకుండానో, మౌఢ్యపు నమ్మకాల్లో పూడ్చి వేయకుండానో శ్రద్ధగా పట్టించుకుంటున్న వారి సంఖ్య ఇంకా తక్కువే.

"ప్రతాపరుద్ర చరిత్రం", "రాయ వాచకం" లాంటి పుస్తకాలు రాజకీయ చరిత్రతో పాటు సాంఘిక చరిత్రకూడా తెలుసుకోవడానికి ఉపయోగపడతాయి. మతాలు, మతావేశాలు, వైషమ్యాలు, సాంఘిక మర్యాదలు, సంప్రదాయాలు, నగర వృత్తులు, పంటలు, ఇలా ఎన్నో విషయాలపై విలువైన సమాచారం మనకు "సాహిత్యం"నుంచి కూడా లభిస్తుంది.

సమన్వయ దృష్టి, సమీకరణ సామర్థ్యాలతో లోతుకు పోయి పరిశీలిస్తే ఒక మంచి సాహిత్యం చదివామన్న అనుభూతితో పాటుగా చరిత్రకారుడికి ప్రయోజన మైన అనేక అంశాలను కూడా అందుకోగలం. ఇంత మంచి సాహిత్యాన్ని, దానిలోనే పాక్షికంగా చరిత్రను కూడా కూర్చుకున్న మనం ఈనాడు దాన్ని ఎందుకు విస్మరించాం అన్నది క్షుణ్ణంగా పరిశీలించ వలసిన విషయం. ప్రస్తుతానికి మరీ లోతుకు పోకుండా కొన్ని ముఖ్య కారణాలను మాత్రం ప్రస్తా వించి వదిలేస్తాను. ఇరవయ్యో శతాబ్దానికి ముందు న్నది క్షీణ యుగమని, ప్రబంధ యుగంలోనూ, దానిని మించి నాయక రాజుల యుగంలోనూ సాహిత్యం అన్న పేరుతో తయారయింది పచ్చి శృంగారమని, అశ్లీల సాహిత్యమని, ఆ కాలపు రచనలు కేవలం అనువాదాలూ, అనుకరణలే అని నమ్మకాల్ని పెంచు కుని మనకు మనం చాలా నష్టం కలగ చేసుకున్నాం. ఈ అభిప్రాయాలు బలంగా పాతుకు పోవడంలో ప్రధానంగా ఇద్దరు వ్యక్తులు కీలకమైన పాత్ర వహిం చారు. ఒకరు కందుకూరి వీరేశలింగం, మరొకరు సి.ఆర్.రెడ్డి. (ఇది వాళ్ళని కించపరిచే ఉద్దేశ్యంతో అంటున్నది కాదు) ఇద్దరూ అపరిమితంగా ఆంగ్లే యుల ప్రభావానికిగురయి Victorian morals తో వ్యవహరించినవారే. నిజానికి వీరేశలింగానికి ముందు మనది మలినమైన సాహిత్యమని అన్నవారెవ్వరూ కనపడడంలేదు. కట్టమంచిగారు విదేశాలలో చదువు కొన్న కారణంగానో, మరి ఆయన చేపట్టిన ఉన్నత పదవుల వల్లనో, లేక ఆయనకున్న రాజకీయపలుకు బడి కారణంగానో, ఆయన రాసిన "కవిత్వ తత్త్వ విచారం" అన్న వ్యాసం అందరికీ పాఠ్యనీయాంశమ యింది. ఇంతా చూస్తే, తొమ్మిది వందలేళ్ళ తెలుగు సాహిత్యంలో ఆయనకు తిక్కన అంటే కొంచెం గౌరవం. సూరన "కళాపూర్ణోదయం" కాసింత నచ్చిం ది. అంతే! చివరకు వీరి వాదనలవల్ల అసలు మనం ఆ కాలపు సాహిత్యాన్ని చదవనక్కరలేదు అన్న అభి ప్రాయం సర్వత్రా వ్యాపించింది. వీరిద్దరూ ఇలా కొట్టి పారేసుండక పోతే మనం వాటిని ఇంకా చదువుతుండే వాళ్ళమనే నేననుకుంటున్నాను. దానికి తోడు గత శతాబ్దం అధిక భాగంలో "ప్రగతిస్వామ్య వాదుల మని" చెప్పుకుంటూ వచ్చిన కొందరు కవులు, కవితా విమర్శకులు వాళ్ళకున్న కారణాలవల్ల కట్టమంచిని, కందుకూరిని పొగడ్తలతో ముంచెత్తారు. వీళ్ళ హోరు లో ఏమయినా అసమ్మతి ప్రకటింపబడినా అది ఎవరికీ సరిగా వినిపించకుండా కొట్టుకుపోయింది. (ఒక్క విశ్వనాథ సత్యనారాయణ కంఠాన్ని మినహా యిస్తే!) క్రమక్రమంగా అంతకు ముందు చదవదగ్గది మన సాహిత్యంలో ఏమీ లేదనే భ్రమలో పడి పోయాం.

నిజానికి 50-60 ఏళ్ళ క్రితం వరకు కూడా వేదం, వెంపరాల, తేవపెరుమాళ్ళయ్య, మానవల్లి లాంటివారు "ఆముక్తమాల్యద", "మనుచరిత్ర", "వసు చరిత్ర" లాంటి కావ్యాలను సంశోధించి టీకాతాత్పర్య సహితంగా ప్రచురిస్తే, సంస్కృత కావ్య సంశోధకులకీ, జర్మన్ ఫిలాలజిస్టులకీ మనం ఏమాత్రమూ తీసిపో మని గర్వించాం కూడా. మరీనాడు అలాంటి సంశోధ నలు వెలువరించగలవారున్నారా అని నాకు సందే హం. ఇది పాతని పొగడటమూ, కొత్తని తెగడటమూ కాదు. "మంచి", "చెడ్డ" అన్న విభజనలతో మనని మనమే చాల నష్ట పరుచుకున్నట్లున్నాం. Classics modern అనే భేదంతో కాకుండా రెండింటినీ ఆధునిక దృక్పథంతో చదవాలన్నదే నేను కోరేది. చివరిగా వెల్చేరు నారాయణరావుగారు (పాదసూచిక చూడం డి) చెప్పినట్లు "మనందరం పాశ్చాత్య ఆధునికతా ప్రభావితులమే. ఆధునికత ఒకవైపు (భావి జీవనానికి అవసరమైన) చైతన్యాన్ని అందిస్తూనే, మరోవైపు పాలితులుగా మనల్ని భావదాస్య దౌర్బల్యానికి గురి చేయడం ద్వారా రెండు విభిన్నమైన ప్రభావాలని మనపై చూపింది. ఆధునిక భావాలని వద్దనుకో వడమూ, లేదా మన చరిత్రను కాదనుకోవడమూ, ఈ రెండూ కూడా సామాజిక ప్రగతిని నిరోధించేవే. ఈ రెండింటినీ కలుపుకునే మార్గాలను అన్వేషిస్తూ ముందుకు సాగాలి." కాదంటారా?




ఎర్రాప్రగడ రామకృష్ణ

## గోదావరి గలగలలు

పేజీలు : 16+222 వెల :రూ.150/-
ప్రతులకు : శ్రీమతి శ్రీలక్ష్మి ఎర్రాప్రగడ
80-32-4/2ఎ, శారదా నగర్
ఆర్టుగేలరీ ఎదురుగ, ఎ.వి.అప్పారావురోడ్
రాజమండ్రి -3. సెల్. 9397907344

ఎర్రాప్రగడ రామకృష్ణ బహుముఖ ప్రజ్ఞాశాలి. ఆయన చేసింది బ్యాంకు ఉద్యోగమైనా పురాకృత పుణ్యం సాహిత్యానికి చేరువ చేసింది. ఎన్ని భువనవిజయ సభలలో పాల్గొన్నారో లెక్కలేదు. ఎన్ని సభలలో ఆయన కవితాగానం వినిపించేరో చెప్పలేము. రచనా వ్యాసంగంలో కూడా పలు రచనలు చేసి లబ్ధ ప్రతిష్ఠులయ్యేరు. జర్నలిస్టుగ ఈనాడుకు లెక్కలేనన్ని వ్యాసాలు, సంపాదకత్వాలు వ్రాశారు. ఈవిధంగ రామకృష్ణ జగమెరిగినవారు.

ఆయన అప్పుడప్పుడు వ్రాసిన వ్యాసములనన్నిటిని ఒకచోట చేర్చి మనకందించాలనే మంచి నిర్ణయం చేసేరు. ఎందుకంటే ఇవి చాలా అమూల్యమైన వ్యాసలు. సమాజం గురించి, సాహిత్యం గురించి, భూత, వర్తమాన పరిస్థితులను గురించి తెలుసుకోవాలనుకునేవారు ఈ గ్రంథం తప్పకుండా చదవాలి. ఈ గ్రంథ రచనతో రామకృష్ణగారు మన తెలుగు నిన్నటి కవులైన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, దిగవల్లి వేంకట శివరావు, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి కోవకు చెందిన వారయ్యారు.

ఈ వ్యాసాలు చదివితే సాయం గోదావరి చల్లని గాలులు మేనిని తాకి ఆహ్లాదపరచినట్టుంటాయి. గోదావరి గట్టుమీద కూర్చుని ఆ నీటిలో జలకాలాడుతూ చిన్నపిల్లల కేరింతల కేకలు వింటున్నట్టుంటాయి. ఎందుకంటే రామకృష్ణ ఆంగ్ల సాహిత్యం అవలోడనం చేశాడు. నన్నయనుంచి నేటి మధునాపంతుల వరకు తరచి చూశాడు. ఆధునిక సాహిత్యం అతనికి కరతలామలకమే. అందుకే తన అనుభవాలను, అనుభూతులను ఈనాడు ద్వారా తెలుగువారందరికీ చాటి చెబుతున్నారు. అట్టి సమర్థుని చేతినుండి వచ్చిన గలగలలు పాఠకుల హృదయాలను గమ్మత్తుగా ఆకర్షిస్తాయి. ఈ నిజం తెలియాలంటే ఈ పుస్తకం తప్పక చదవాలి. - సంపాదకుడు




డా. కందాళ లక్ష్మీనారాయణ
శ్రీమదప్పయదీక్షిత ప్రణీత

## వరదరాజ స్తవము

తత్త్వవేది ఆంధ్ర వ్యాఖ్య

పేజీలు :40+397 వెల : రూ. 240/-
ప్రతులకు : 8-145/2, 3వ అడ్డరోడ్డు,
పరమేశ్వరీ నగర్, నెల్లూరు-524 001
సెల్ : 99852 37353

మాన్య మిత్రులు, సహృదయశిరోమణులు, పండిత రత్న, ఉ.వే. శ్రీమాన్ డా. కందాళ లక్ష్మీనారాయణగారు రాష్ట్రపతి పురస్కార గ్రహీత, సంస్కృతాంధ్ర వ్యాకరణ రసజ్ఞ శ్రీ శ్రీపాద లక్ష్మీనారాయణశాస్త్రిగారి దగ్గర క్షుణ్ణంగా వ్యాకరణ పఠనం చేసిన వండితవర్యులు. చదువుకొంటున్న రోజుల్లోనే తాను విన్న కువలయానందపాఠం సందర్భంలో వరదరాజ స్తవం అన్న మాట విన్నారు. అజ్ఞాతంగా ఆనాడే ఒక తెలియని కోరిక ఆయన మనసులో ప్రవేశించింది. అది ఆరు పదుల తరువాత ఈ గ్రంథరూపంలో నేడు వెలువడింది

అప్పయ్య దీక్షితులవారు తమిళనాడులో అడయప్పాడు గ్రామంలో 1554 సంవత్సరంలో జన్మించారు, 1626 సంవత్సరంలో శివైక్యం చెందారు. తాత ఆచార్య దీక్షితులు అద్వైతి, ఈయన భార్య తోతరంభ వైష్ణవురాలు. వీరి కుమారుడు రంగరాజమఖి. ఈ రంగరాజమఖి కుమారుడు అప్పయ్య దీక్షితులు. ఈయన శివుని అవతారమనీ, అపర శంకరులని ప్రఖ్యాతి చెందారు. అప్పయ్యదీక్షితులను స్మరించకుండా సంస్కృత సాహిత్యమే లేదు. హిందుమతానికి ఆయన చేసిన సేవ నిరుమానం. ఆయన గురించి వినడమే కర్ణామృతం. భారద్వాజ గోత్రీకుడు,సామవేద శాఖీయుడు. ఈయన పేరు వినాయక సుబ్రహ్మణ్యం. ఈయన 104 వేదాంత ధర్మ గ్రంథాలు వ్రాశారు, 104 వేద కర్మలు (యజ్ఞాలు) చేశారు. ద్వైత,అద్వైత,విశిష్టాద్వైతాల ప్రత్యేకతలను వివరిస్తూ దీక్షితుల వారు నయమంజరి (అద్వైత),నయమణిమాల (శైవము), నయమయూఖమాలిక (వైష్ణవము),నయముక్తావళి (ద్వైతము) అనే నాలుగు గ్రంథాలను వ్రాశారు. యాదవాభ్యుదయానికి వ్యాఖ్యానం వ్రాశారు.

ఈ మహనీయుని గ్రంథాన్ని పదిమందికీ తెలిసేలా తెలుగులో వివరించాలనే కోరికతో ఈ వ్యాఖ్య సంతరించారు. ఈ వ్యాఖ్య ముందుగా 'ఆత్మజ్యోతి' పత్రికలో వచ్చి జనాదరణ పొందింది. ఆసక్తిపరులకు ఆనందాన్నిచ్చే అమూల్య గ్రంథం మనడంలో సందేహంలేదు. ఈ తత్త్వవేది వ్యాఖ్య అందరూ తప్పక చదువదగినది. చదవండి. - సంపాదకుడు